# విశ్వప్రకాశం

బుద్ధపూర్ణిమ ప్రత్యేక సంచిక మే 1998

సంపుటి : 4 సంచిక : 6 వెల రూ. 5-00

*ముఖ్య సంపాదకులు :*
**శ్రీ పి.వి. మనోహరరావు**

*సంపాదకులు :*
**శ్రీ అక్కిరాజు రమాపతిరావు**

*సంపాదకవర్గం :*
**డా. బిరుదురాజు రామరాజు**
**డా. పోతుకూచి సాంబశివరావు**
**డా. దిట్టకవి శ్యామలాదేవి**
**శ్రీ కనుమలూరి వెంకటశివయ్య, ఐ.ఎ.ఎస్.**
**శ్రీ యం.యల్. నరసింహారావు**

*ప్రకాశకులు :*
**సర్వార్థ సంక్షేమ సమితి**
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్ - 500 080

*ఇందులో ........* *పుట*

సంపాదకీయం
కీ.శే. గొబ్బూరి వేంకటానందరాఘవరావు 2
శివరాత్రిమహిమ
*- డా॥ డి. అర్కసోమయాజి* 4
గౌరీపూజ 9
విశ్వయోగివాక్కు - వేదవాక్కు
*- వి. రత్నమోహిని* 12
మరోసారి సాయికథలు
*- అక్కిరాజు రమాపతిరావు* 16
కాళిదాస సందేశము
*- కీ.శే. అక్కిరాజు నిత్యానందశాస్త్రి* 20
శ్రీ విశ్వయోగి విశ్వంజీ జన్మదిన వేడుకలు
*- వి. రత్నమోహిని* 24
స్వర్ణోత్సవం
*- వనం సావిత్రీనాథ్* 28
సంక్షిప్త రామాయణమ్
*- రుద్రావఝుల రామకృష్ణారావు* 30
ఆంధ్రభాష - సంస్కృత సంబంధము
*- కీ.శే. ప్రయాగ వెంకటరమణశాస్త్రి* 33

*ముఖచిత్రం :*
**గౌతమబుద్ధుడు**

సంపాదకీయం

# కీ|| శే|| గొబ్బూరి వేంకటానందరాఘవరావు

ఈ మహాపురుషుణ్ణి గూర్చి, ఈ విజ్ఞాన శాస్త్రనిధిని గూర్చి తెలుగువాళ్ళకు తెలియవలసినంతగా తెలియకపోవడం చాలా విచారకరం ఖగోళ విజ్ఞానంలో ఈయనంత కృషి చేసినవారు తెలుగువారిలో ఈయనతో సాటి రాదగినవారు మరొకరులేరు శాస్త్రవిజ్ఞానకృషిలో వీరిని బాలగంగాధర తిలక్ మహాశయుడితో పోల్చవలసి ఉంటుంది.

వీరు రచించిన గ్రంథాలు 1. ఆంధ్ర వచనరచనా పరిణామము, 2 నన్నయభట్టు విజ్ఞాన నిరతి, 3. జ్యోతిర్వేదము, 4. నక్షత్రములు, 5. చుక్కలసుద్ది.

ఆంధ్రదేశంలో జన్మించిన మహాపురుషులలో వేదవేత్తలలో విజ్ఞాన ఖనులలో కోట వెంకటాచలం, వేటూరి శివరామశాస్త్రి, గొబ్బూరి వెంకటానందరాఘవరావుగారలు అగ్రగణ్యులు. వీరినిమించిన విజ్ఞానశాస్త్రవేత్తలేరీ? అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఈ మహానుభావులను ప్రశంసించినట్లు పెద్దలు చెబుతారు.

వియన్మండలంలోని నక్షత్రాలు అరచేతిలోని రేఖలకన్నా స్పష్టంగా ఆయన పరిశీలించాడు. దుర్బిణీయంత్రం సహాయం లేకుండా సామాన్య నేత్రాలకు ఎనిమిదివేల చుక్కలు కనపడతాయని ఆయన చెప్పారు. అంటే ఆ చుక్కలన్నిటినీ ఆయన శోధించారన్నమాట. భూమ్యాకాశాల సంబంధాన్ని శ్రీ రాఘవగారు చక్కగా అధ్యయనం చేశారు. మన పండుగలన్నిటికీ జ్యోతిర్మండలంలోని నక్షత్రగ్రహతారల వియన్మండల పరిభ్రమణకూ సంబంధముందని వారు నిరూపించారు. మన పురాణగాథలన్నీ నక్షత్రచిత్రాల ద్వారా వారు ఆకాశం మీద చూపుతారు. శ్రీ రాఘవరావు రచించిన నక్షత్రాలు, చుక్కల సుద్ది చదవటం ఒక గొప్ప సాహిత్యానుభూతి, మన ప్రాచీన తెలుగు కవులు ఎంత విజ్ఞానవేత్తలో దివ్య చక్షులో వారి ఖగోళ విజ్ఞానం ఎంత ప్రశంసనీయమో శ్రీ గొబ్బూరివారు వారి ఆయా కావ్యాలనుంచి సాక్ష్యాలు చూపుతారు

బ్రహ్మాండాది నానా పురాణవిజ్ఞాన నిరతుడు నన్నయ్య భట్టారకుడని ఆదిపర్వం అవతారికలో ప్రస్తావితమైన విషయం అక్షరసత్యమని శ్రీ రాఘవరావు తమ గ్రంథంలో నిరూపించారు శ్రీ గొబ్బూరివారి వేదవిజ్ఞానం పరమాశ్చర్యం గొలుపుతుంది. చంద్రుడొకసారి క్రాంతివృత్తాన్ని చుట్టిరావడానికి 29 రోజుల 12 గంటల 44 నిమిషముల 2 87 సెకండ్లు పడుతుందని భారతీయ ఖగోళ విజ్ఞానవేత్తలకు తెలుసునని శ్రీరాఘవరావు నిరూపించారు. భూమి ఒకసారి సూర్యుణ్ణి చుట్టిరావడానికి 365 రోజుల 5 గం.ల 48 నిమిషముల 49.7 సెకండ్లు పడుతుంది. ఈ లెక్కను సౌరసంవత్సరమంటారు చాంద్రమాన సంవత్సరానికీ సౌరమాన సంవత్సరానికీ 10 రోజుల 21 గంటల చిల్లర అని వేద ఋక్కుల ఆధారంగా గొబ్బూరివారు వివరించారు.

ఇటీవల పాశ్చాత్యులు కనిపెట్టగలిగిన వెలుగు వేగం నన్నయ భట్టారకుడికి

9 శతాబ్దాలకు ముందే తెలుసునని చూపారు రావుగారు. "సంస్కృత భారతమూలమున నీవిషయములేదు. లేకపోయినను తెనుగు ప్రజల విజ్ఞానాభివృద్ధినికోరి భారతార్థమును తెనుగున రచించిన విజ్ఞాన నిరతుడు నన్నయభట్టు" అన్నారు రావుగారు.

ఋగ్వేదం ప్రథమ మండలమునందు గల 50వ సూక్తము సౌరసూక్తము - ద్రష్ట - ప్రస్కణ్వమహర్షి - విశ్వంలో వెలుగుకుగల వేగం మరిదేనికీ లేదని ప్రస్కణ్వుడు తెలిపియుండెను - అని వివరించారు గొబ్బూరివారు. ఋగ్వేదానికి భాష్యంవ్రాసిన సాయణ మాధవాచార్యులవారు వెలుగు వేగాన్ని సరిగ్గా లెక్కకట్టారని వ్యాఖ్యానం నుంచి చూపారు.

స్కంద పురాణం నుంచి కాశీఖండాన్ని అనువదించినా మూలంలో లేకపోయినా శ్రీనాథ మహాకవి వెలుగువేగం "నిమేషార్థమున రెండువేల రెండువందల యోజనములని తెలిపిఉన్నాడు" అని ఉదాహరించారు శ్రీ రావుగారు.

మానవులభ్యసించిన శాస్త్రములన్నిటిలో మొదటిది జ్యోతిశాస్త్రమే అంటారు రావుగారు. సర్ జెమ్స్ జేన్స్ దొరవారు జ్యోతిశ్శాస్త్రాన్ని "Most poetical of all sciences" అన్నారుట.

"పురాణముల ద్వారా పురాణకర్తలు భారతీయ జనసామాన్యమునకు విజ్ఞానసారము ప్రసరింపజేసినట్లు పాశ్చాత్య వైజ్ఞానికులు పడమటి ప్రజకు విజ్ఞానసారము నందియ్యలేకపోవుచున్నారు" అన్నారు రావుగారు.

'క్లోరోఫిల్' (ఆకులలోని హరిత పదార్థం) ఫోటో సింథసిస్ ప్రక్రియ ఋగ్వేదం 8వ మండలం 90వ సూక్తం 14వ మంత్రం చక్కగా వివరిస్తుందని - ఆ మంత్రం ఉదాహరించి వ్యాఖ్యానించిచూపారు శ్రీ గొబ్బూరివారు. హైడ్రోజన్ (ఉదజని), ఆక్సిజన్‌లను గూర్చి వేద ఋషులకు చక్కగా తెలుసుననీ వాటి సంయోజనంవల్లనే నీరు ఆవిర్భవిస్తుందనీ మంత్రాలు చూపి వ్యాఖ్యానించారు శ్రీ రావుగారు.

పాశ్చాత్యుల దృష్టిలో ఏ గ్రంథంలోనైనా దైవప్రసక్తి వస్తే అది మత గ్రంథమవుతుందిగాని అది విజ్ఞానశాస్త్ర గ్రంథంకాదు. ఇది విపరీతధోరణి - తప్పు అవగాహన అని శ్రీ రావుగారు చెప్పారు. జనసామాన్యానికి విజ్ఞాన విషయాలు బోధించటంలో పాశ్చాత్యులకన్నా భారతీయులే ముందున్నారని సప్రమాణంగా చూపారు. "అనుభవసిద్ధమైన ఎఱుక విజ్ఞానమగుననియు, అనుభవ సిద్ధముకానిది జ్ఞానమగుననియు గీతావ్యాఖ్యానములు తెలుపుచున్నవి" అని జ్ఞాన విజ్ఞాన భేదాన్ని శ్రీ రావుగారు చక్కగా వ్యాఖ్యానించారు.

ఖగోళ విజ్ఞానవిషయాలను కవితలాగా, సృజనాత్మక రచనలాగా చదివించటం శ్రీ రావుగారికే చెల్లింది. ఒక ప్రస్తావన తెచ్చి ప్లూటార్క్ మహాశయుడి హెచ్చరికనాయన ఇట్లా వివరించారు.

"It is often a proven certainity that the loss of moral sanity will sooner or later, entail political disintegration and national decay" (వెయ్యేళ్ళ కిందటి హెచ్చరిక)- గ్రీసు, రోముల పతనావస్థకు కారణాలు చెప్పారు రావుగారు. శ్రీ రావుగారు ఏప్రిల్ నెలలో జన్మించారు. వీరికి విశ్వప్రకాశం నివాళి ఇది.

# శివరాత్రిమహిమ

- డా॥ డి. అర్కసోమయాజి

1 జన్మానికి శివరాత్రి అంటారు పెద్దలు. దీని తాత్పర్యమేమో భారతీయులు తిరిగి స్మరించుకోవాలి. శివరాత్రి ప్రతి సంవత్సరము మాఖ బహుళ చతుర్దశియొక్క రాత్రి. ఆ రాత్రి 12 గంటలకు లింగోద్భవకాలమంటారు. రాత్రి జాగరణ చేయుచు శివస్మరణ చేసుకోవాలి. ఉషః కాలమందు తిరిగి స్నానముచేసి శివారాధన చెయ్యాలి. ఏ రోజున శివరాత్రి వస్తుందో ఆ పగలు మహాన్యాస పూర్వకముగ రుద్రాభిషేకము చేసుకుంటే ఆయుర్వృద్ధి అంటారు పెద్దలు.

2. పరమేశ్వరు డొక్కడేయైనను సృష్టి సమయములో బ్రహ్మయని పోషణ సమయములో విష్ణువని, సంహార సమయములో రుద్రుడు లేక శివుడని పిలువబడతాడు. అనగా శివుడు మరణమున కధిదేవత. మర్త్యులందరు మరణ శీలురేగావున, అపమృత్యువు రాకుండా శివుని ప్రార్థించాలి. అపమృత్యువనగా చిన్న వయస్సులోనే ఏ రైలు ప్రమాదములోనో, కారు ప్రమాదములోనో విమాన ప్రమాదములోనో మరణించుట పుట్టినవానికి చావు తప్పదుగాని అపమృత్యువు, దుర్మరణము రాకుండా ఉండాలంటే శివారాధన చాలముఖ్యము. మన పుట్టుకగాని, చావుగాని మన చేతిలో లేవు. ఏ వ్యక్తి ఎచ్చట, ఏలాగు మరణించాలో అది లలాట లిఖితమని, మన జన్మాంతర సుకృత దుష్కృతాన్ని బట్టి ఉంటుందని హిందూమతము చెప్పుచున్నది. ఒక వ్యక్తి నూరేండ్లు బ్రతికి పత్నీ పుత్ర పౌత్రాదుల సన్నిధిలో స్వగృహములో మరణించిన, అట్టి మరణము జన్మాంతర పుణ్యముగల వారికి సంభవించును మహా పాపాత్ములకు దుర్మరణము తప్పదని పెద్దలంటారు. జ్యోతిశ్శాస్త్రములో ఏ వ్యక్తి ఏ విధముగా ఎచ్చట మరణిస్తాడో చెప్పబడింది. "శుభైః శుభేదేశే పాపైః కీకటే" అనగా కారకాంశ లగ్నాత్ మూడవ యింట శుభగ్రహాలుంటే నూరేండ్లు బ్రతికి స్వగృహమందు పుత్ర పౌత్రాదులందరి సమీపములో మరణించునట. పాపగ్రహాలుంటే ఎచ్చటనో దారా పుత్రాదులకు దూరములో దిక్కులేని చావు చచ్చుట. మఱియు ఏ వ్యక్తి ఏ వ్యాధిచేత మరణించునో జ్యోతిశ్శాస్త్రము చెప్పింది. అయితే ఈ మరణము లలాట లిఖితమైయుంటే ఆ అపమృత్యువును తప్పించుకొనే శక్తి మర్త్యునకుందా అని సందేహము రావచ్చు దానికి సమాధానమేమనగా మార్కండేయ చరిత్రయే. 16 సం॥లకే మృత్యువని మార్కండేయునికి చెప్పబడగా, అఖండమైన శివారాధనచేసి అపమృత్యువును తప్పించుకొని చిరంజీవియైనాడని పురాణము చెప్పింది. కావున శివారాధన అపమృత్యువు రాకుండా కాపాడగలదని భావము. శివునికి అందుకే మృత్యుంజయుడని పేరు వచ్చింది.

3. భక్తికి తపస్సునకు సాధ్యముకాని విషయములు లేవు. పాతివ్రత్యముచేత సావిత్రి తన భర్తను మృత్యువునుండి కాపాడినది. కావున సంవత్సరమున .కొక దినమైన ఉపవసించి, రాత్రి జాగరణముండి పరమేశ్వరా! నాకు దుర్మరణములేకుండా చేయుమని తీవ్రభక్తితో శివుని ఆరాధించమని, ఆ దినమునకు శివరాత్రి దినమని పేరు పెట్టారు.

నిత్యము నిద్రపోతున్నాము ఒక్కదినమైన, నిద్రాహారములు మాని ఈశ్వరారాధాన చేయమని మహర్షులు చెప్పారు

4 వేదములో రుద్రాధ్యాయమని యున్నది ఆ అధ్యాయాంతమందు రుద్రశక్తి మనుష్యునకెట్లు మరణమును చేకూర్చునో వర్ణించబడింది. మనము త్రాగేనీరు ద్వారా కలరావంటి వ్యాధి వచ్చి మనము మరణించవచ్చు. పీల్చేగాలి ద్వారా విషూచివ్యాధి చేత మరణించవచ్చు. తినే అన్నము ద్వారా క్రిములు గర్భకోశమందు ప్రవేశించి జీర్ణకోశమును పాడుచేసి మృత్యువును ఘటించవచ్చు. చీకటిలో నడిచేదారిలో కాలసర్పము కరచి మరణించవచ్చు ఇట్టివన్నీ జన్మాంతర దుష్కృతమువలన సంభవించును. కావున మరణమున కధిదేవతయైన శివుని ప్రార్థించమని శివరాత్రి అంటూ ఒక దినమేర్పాటు చేశారు పెద్దలు.

5. మరణమన్న భయములేనివారు లేరు. సర్వసంగ పరిత్యాగముచేసిన ఏ పరమహంస పరివ్రాజకాచార్యులో కోటానుకోట్లలో ఒక్కరుంటారు. అట్టివారు నేడును ఉన్నారు. జగద్గురువులు శ్రీ కంచికామకోటి పీఠాదిపతులు (వృద్ధులు) అట్టి మహనీయులు. అటువంటి వారికి తప్ప అస్మదాదులందరికి మరణమన్న భయమే. ఈ మరణము మనచేతిలోలేదని తెలిసికూడ, మరణము నుండి కాపాడు శివుని ఆరాధించాలని భావము కలుగకపోతే జన్మాంతర దుష్కృతమే దుర్మరణమును ఘటింపజేయును. The law takes its own Course అన్నట్లు జన్మాంతర దుష్కృతము బలీయమగును. ఆ దుష్కృత పరిపాకమును శివారాధన వలన చప్పించుకొనవచ్చునని మహర్షుల తాత్పర్యము 'More things are wrought by prayer than the world dreams of' అని ఒక పాశ్చాత్య కవి టెన్నిసన్ అనువాడు ప్రార్థన వలన ఎన్నో పనులు సాధించవచ్చునని, ఆధి వ్యాధులను జయించవచ్చునని చెప్పాడు. ఆ విషయాన్నే మన మహర్షులు ఎలుగెత్తిచాటారు.

6. కలికాలవశమున మన జీవితములో తపస్సు అనేదే మఱచిపోయాము. ఆనంద భాష్పములతో భగవదారాధన చేయువారు అరుదైపోయారు. స్వప్రాగల్భ్యము వలన సమస్తము సాధిస్తామనుకోవడం మూర్ఖత్వము. అట్టివానికి పరమేశ్వరుడే బుద్ధి చెప్తాడు. 'ఓరీ! మానవా! నీ తాహతు ఎంత? నీ జన్మగాని, నీ మరణముగాని, నీ విద్యైశ్వర్యములు గాని నీ భార్యాపుత్రులుగాని నీ ప్రాగల్భ్యము వలన సిద్ధించవు. ఈ మహా విశ్వమును సృజించి నడిపించుచున్న నన్ను తెలిసికో. గర్వము పొందక తలవంచి ఆరాధన చేయుము' అని భగవద్గీతలో బోధించబడింది. సంవత్సరమునకు 364 రోజులు విడిచి, ఒక్క శివరాత్రి దినమందైనను పరమేశ్వరుని గూర్చి తపస్సు చేయమని, శివరాత్రిని కేవలము తపస్సునకు కేటాయించిరి మహర్షులు. మిగిలిన మన పండుగలు వేరు. శివరాత్రి వేరు. శివరాత్రి కేవలము ఆధ్యాత్మిక తత్త్వము కొఱకు కేటాయించబడిన రోజు.

7. అయితే మాఖ బహుళ చతుర్దశియే శివరాత్రియని పెద్దలందరు ఎందుకేర్పాటు చేసారు అనేప్రశ్న రావచ్చు. దానికి సమాధానము సాధారణముగ మృత్యువులు శీతాకాలమందే ఎక్కువ. ఆ శీతాకాలము ఖగోళశాస్త్ర రీత్యా శివరాత్రితో ఆఖరు. శీతాకాలములో మరణించకుండా కాపాడినందులకు శివునికి జోహారు చేయుట కొఱకై

శివరాత్రి వ్యవస్థచేసారు. 'నమశ్శివాయ' అను పంచాక్షరీమంత్రము అకాల మృత్యువు రాకుండా కాపాడే మంత్రము. జ్యోతిశ్శాస్త్రములో మారకదశ అని చెప్పబడింది. అనగా తీవ్రమైనవ్యాధి సంభవించుదశ. ఆ మారకదశ నుండి తన్ను కాపాడుకొనుటకు మృత్యుంజయ మంత్రమును జపించుమని నాడీ గ్రంథములు చెప్పాయి. 'త్ర్యంబకం యజామహే .... మృత్యవే స్వాహా మృత్యవే స్వాహా' అను మంత్రము మృత్యుంజయ మంత్రము. తద్వారా అపమృత్యువును జయించవచ్చునట. అయితే ఈ మంత్రమును జపించకుండానే ఎందరో దీర్ఘాయువు కలిగియున్నారే అనే ఆక్షేపణ కలుగవచ్చు. దానికి సమాధాన మేమనగా అట్టివారు జన్మాంతర సుకృతము కలవారని చెప్పాలి

వనే, రణే, శత్రుజలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వతమస్తకే వా
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా
రక్షంతి పుణ్యాని పురాకృతాని

అనగా మహారణ్యమందుగాని, యుద్ధమందుగాని, శత్రుమధ్యమునుండిగాని జలమధ్యమునుండిగాని, అగ్నిమధ్యమునుండిగాని మరణించకుండా ఒకడు తప్పించుకున్నాడంటే దానికి కారణము పురాకృత పుణ్యమే. మనుష్యుని ఇహలోకమునందు నడిపించునవి రెండు. ఒకటి జన్మాంతరసుకృతము. రెండవది, ఈ జన్మయందు చేస్తూ ఉన్న భగవదారాధన వలన కలుగు దైవానుగ్రహము. జన్మాంతర సుకృతమును ఈ జన్మలో మార్చలేము. కాని భగవదారాధన చేసి దైవానుగ్రహమును సంపాదించుకోవచ్చు. మనకు పరమేశ్వరుడు దేహమునిచ్చి, విద్యా సంపత్తులనిచ్చి, ఇంద్రియసౌష్ఠవమునిచ్చి, అన్నియుచేకూర్చినా, ఆ పరమేశ్వరుని కృతజ్ఞతాభావముతో చేతులెత్తి నమస్కరించని మానవుడు, మానవుడుకాడు పశుతుల్యుడే.

8. శివానందలహరిలో శంకర భగవత్పాదులొక చక్కని శ్లోకమును వ్రాసారు "మార్గావర్తిత పాదుకా...." అని, ఒక బోయివాడు మహాభక్తుడట. నిత్యము శివారాధన చేస్తుండేవాడట. శివలింగము దగ్గరకు వెళ్లి తన చెప్పుతో శివనిర్మాల్యము తుడిచివేసి పుక్కిళ్ల జలముతో ఆ లింగమున కభిషేకముజేసి, తాను కొంతతిని బాగా ఉన్నదని భావించిన మాంసమును ఆ శివలింగమునకు నివేదన చేసేవాడట. అతనికి శివుడు సాక్షాత్కరించినట్లు చెప్తూ శంకరులు "భక్తిః కింనకరోతి, అహోవనచరో భక్తావతంసాయతే" అన్నారు భక్తిఏమి సాధించలేదు. వనచరుడు కూడ భక్తావతంసుడైనాడే అని వ్రాసారు.

కావున భారతీయులారా! మన హిందూమతమును బాగా తెలిసికోండి. మిగిలిన మతములవలె మన మతము కేవలము నీతి మాత్రమే బోధించదు. జీవిత రహస్యాన్ని గూర్చి ఉపనిషత్తులు తర్కించాయి. ఆ ఉపనిషత్తులసారాన్నే వేదవ్యాసులు బ్రహ్మసూత్రములుగా వ్రాసారు. ఆ ఉపనిషత్తుల సారాంశమే భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు. భగవద్గీత ఈ మూటిని ప్రస్థాన త్రయమన్నారు. ఈ ప్రస్థాన త్రయమునకే వేదాంత శాస్త్రమని పేరు. కావున ఈ వేదాంతము వేదముల సారము. కేవలం నీతిసూత్ర బోధకమేగాక, వేదాంత శాస్త్రమూలకమైనది మన హిందూమతము. మనము చాలావరకు పాశ్చాత్య విద్యావ్యాముగ్ధులమై మన మతముయొక్క గొప్పతనాన్ని తెలుసుకోలేకపోతున్నాము.

శివరాత్రినాడు పగలు శివాలయమునకు వెళ్లి మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము చేసికొని, రాత్రి జాగరణముండి ఈ క్రింది అర్ధనారీశ్వరాష్టకమును పఠించుకోండి.

## అర్ధనారీశ్వరస్తవము

అంభోధర శ్యామల కుంతలాయై
తటిత్ప్రభాతామ్ర జటాధరాయ।
నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ
నమశ్శివాయైచ నమశ్శివాయ॥

ప్రదీప్తరత్నో జ్జ్వలకుండలాయై
స్ఫురన్మహా పన్నగ భూషణాయ
శివప్రియాయై చ శివాప్రియాయ. నమః॥

మందారమాలా కలితాలకాయై
కపాల మాలాంకిత కంధరాయ
దివ్యాంబరాయైచ దిగంబరాయ నమః॥

కస్తూరికా కుంకుమ లేపనాయై
శ్మశాన .భస్మాంగ విలేపనాయ
కృతస్మరాయై వికృతస్మరాయ నమః॥

పాదార విందార్పిత హంసకాయై
పాదాబ్దరాజ త్ఫ - నూపురాయ
కలామయామై వికలామయాయ నమః॥

ప్రపంచ సృష్ట్యున్ముఖ లాస్యకాయై
సమస్త సంహారక తాండవాయ
జగజ్జనన్యై జగదేక పిత్రే నమః॥

ప్రఫుల్ల నీలోత్పలలోచనాయై
వికాసపంకేరుహలోచనాయ
సమేక్షణాయై విషమేక్షణాయ నమః॥

అంతర్బహిశ్చోర్ధ్వమధశ్చ తద్వత్
పురశ్చ పశ్చాచ్చ విదిక్షు దిక్షు
సర్వంగతాయై సకలంగ తాయనమః॥

## చంద్రశేఖరస్తోత్రం (అష్టకము)

చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర పాహిమాం।
చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర రక్షమాం॥

రత్నసాను శరాసనం రజతాద్రి శృంగనికేతనం
శింజినీకృత పన్నగేశ్వర మచ్యుతానననసాయకం
క్షిప్రదగ్ధ పురత్రయం త్రిదివాలయైరభివందితం

చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః॥

మన పెద్దలనూచానంగా అర్ధనారీశ్వరస్తవము నిత్యము రాత్రి పఠించేవారు. దాని భావమేమనగా పార్వతీదేవి ప్రవృత్తి సూచకురాలు, పరమేశ్వరుడు నివృత్తిసూచకుడు అనగా ప్రపంచములోని సృష్టి క్రమము కొఱకు పార్వతి ప్రయత్నిస్తూండగా పరమేశ్వరుడు సంహార క్రమమును పాటిస్తున్నాడు. ఒకవైపు క్రొత్తజీవులు పుట్టుతుండగా, ఒకవైపు కొందరు జీవులు నశిస్తున్నారు. ఈ జగన్నాటక మంతులేనిది ఎంతమందీ భూలోకములో పుట్టి గతించారు. వారి నామరూపములు నేడు లేవే. మన జీవితములు అట్లే బుద్బుదప్రాయములని గ్రహించి, జన్మరాహిత్యము కొఱకు పరమేశ్వరునారాధించమని ఆ అష్టకము బోధిస్తోంది. జన్మ ఎప్పుడైతే ఉందో మృత్యువు అప్పుడే ఉంది. మనమంతా ఎన్ని జన్మలెత్తి నేటికి మానవులై పుట్టామో తెలిసికోండి. ఈ ఉత్తమమైన మనుష్యజన్మను వ్యర్థపరచకండి. దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. ఆరోగ్యముండగానే ఈశ్వరారాధన చెయ్యాలి. కనీసము తిరిగి మానవులమై పుట్టాలని కోరుకోండి. మేయుటకు పశువు గడ్డిబీడుకు పోయి నెమరు వేయుట ప్రారంభించినట్లు మనము ఏదో ఒక గొప్పపని సాధించుటకు మనకు భగవంతుడుత్తమమైన మానవజన్మనిస్తే దాన్ని వ్యర్థపరచి, మేయుటకుబదులు నెమరువేయు పశువువలె ప్రవర్తించరాదు.

శివప్రసాద సిద్ధిరస్తు

మహాభక్తుడైన బమ్మెరపోతనామాత్యుడు భాగవతాంతమందు ఒక చక్కని పద్యమును వ్రాసినాడు. అదియేదనగా

అంధేందూదయముల్ మహా బధిర శంఖారావముల్ మూకసత్
గ్రంథా భ్యాసనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావళ్
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడసత్
గంధంబుల్ హరిభక్తి వర్జితుని రిక్తవ్యర్థ సంసారముల్॥

అనగా ఏ మానవుడీ సంసారమందు పరమేశ్వరుని స్మరించడో తానే స్వప్రాగల్బ్యము వలన సమస్తమును సాధించగలనని విర్రవీగునో ఆతని సంసారజీవితము గ్రుడ్డివానికి వెన్నెల వంటిది. చెవిటివానికి శంఖారావము వంటిది. మూగవానికి భాగవత పురాణ ప్రవచనము చేయుటవంటిది. నపుంసకుని కామమువంటిది. కృతఘ్నుల బంధుత్వము వంటిది. భస్మమందు హోమము చేయుటవంటిది. లుబ్ధుల ధనము వంటిది. పందికి పన్నీరు వంటిది. అనగా దైవారాధనమే మానవుని జీవితములో సారాంశమని మహర్షులుద్ఘాటించిన విధమును పోతనామాత్యుడు మనకు తెలియజేసినాడు. కొంతమంది అజ్ఞులు విష్ణువా, శివుడాయని వాదము చేస్తూంటారు. భగవంతుడొక్కడేయని మాత్రము కూడా వారికి తెలియదన్నమాట. సృష్టి సమయమందు బ్రహ్మ, పోషించుటయందు విష్ణు, సంహరించుటయందు శివుడని ఒకే భగవంతునికి మూడు కర్తవ్యములు. కావున శివరాత్రి దినమున భగవంతుని శివునిగా ధ్యానించుట అందరకు కర్తవ్యము.

# గౌరీపూజ

మన హిందూ వివాహ కార్యక్రమంలో సాంప్రదాయసిద్ధంగా సుముహూర్తానికి ముందు వివాహవేదికలో ఒక పూజాస్థలాన్ని ఏర్పరచుకొని, కన్యచేత గౌరీ తపస్సు చేయిస్తాము.

జరుగబోయే వివాహ కార్యక్రమం సుసంపన్నం కావాలని తనమదిలో మెదిలే పురుషునితో వివాహం జరగాలని, తన పసుపు కుంకుమలు కలకాలం నిలవాలన్న కోరికకి ప్రతీకే ఈ ఆచారం అయి ఉంటుంది.

పురాణ-ఇతిహాసాలు మనకు ప్రమాణాలు. బమ్మెరపోతనామాత్య ప్రణీతమైన రుక్మిణీ కల్యాణములో "రుక్మిణీదేవి గౌరిపూజ కరుగుట" అను ఒక ఘట్టములో

సీ|| సన్నద్ధులై బహు శస్త్రసమేతులై
        బలసి చుట్టును వీర భటులు గొలువ,
    ముందఱనుపహారములుగాను కలుగొంచు
        వర్గంబులై వారవనితలేగ,
    పుష్పగంధాంబర భూషణకలితలై
        పాడుచు భూసుర భార్యలరుగ,
    బణవమర్దళ శంఖ పటహకాహళవేణు
        భేరీధ్వనులమిన్ను పిక్కటిలగ

ఆ|| దగిలి సఖులు గొలువ దల్లులు బాంధవ
    సతులు దోడరాగ, సవినయముగ
    నగరు వెడలి నడవె నగజాతకును మ్రొక్క
    బాలచికుర పిహిత - ఫాలమగుచు"

వినయముతో పార్వతీదేవికి మ్రొక్కి, పూజించుటకు అంతఃపురమునుండి బయలుదేరిన రుక్మిణీ దేవి ఏవిధంగా ఉంది?

వ|| మఱియు, సూతమాగధ వందిగాయక పాఠక జనులంతంత నభినందించుచు జనుర మందగమనంబున ముకుంద చరణారవిందంబులు డెందంబున దలంచుచు నిందు ధరసుందరీ మందిరంబుజేరి, సలిలధారా ధౌతకర చరణార విందయై వార్చి, శుచియై, గౌరీ సమీపంబున కుంజనియె, నంత ముత్తైదువలగు భూసురోత్తముల భార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి, గంధాకృతంబులిడి, వస్త్రమాల్య భూషణాదుల నలంకరించి, ధూపదీపంబులొసంగి, నానావిధోపహారంబులు సమర్పించి కానుకలిచ్చి, దీపమాలికల నివాళించి, రుక్మిణీ దేవిని మ్రొక్కించిరప్పుడు."

ఉ॥ "నమ్మితి నామనంబున సనాతనులైన ఉమామహేశులన్
మిమ్ము బురాణ దంపతుల, మేలు భజింతుగదమ్మ! మేటిపె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ హరింబతిసేయుమమ్మ! నిన్
నమ్మిన వారికెన్నటికి నాశములేదు గదమ్మయీశ్వరీ!" 66

ఈ విధముగా బ్రస్తుతించి, రుక్మిణీదేవి పార్వతీదేవికి నమస్కారము చేసి, భర్తలతోగూడియుండునట్టి బ్రాహ్మణస్త్రీలకు (దంపతులకు) ఉప్పుతోచేయబడిన పిండివంటలును, తాంబూలములను, తాళిబొట్లును (మంగళసూత్రములను) పండ్లును, చెఱుకుగడలును, దానముచేసి, ఆ దంపతులను పూజించెను అటుపై ఆ బ్రాహ్మణ దంపతులు సంతోషమును బొంది, బాగుగా ఆశీర్వాదము చేసి, అక్షతలు యువతి శిరమునందు ఉంచిరి. మంగళాక్షతలన్నియు ధరించి, రుక్మిణి శంకరుని భార్యయగు గౌరీ దేవికి మ్రొక్కి, ఎవ్వరితోను మాటలాడని నియమమును అవలంబించినదై గౌరీదేవి ఆలయమునుండి బయలుదేరెను అని సవివరంగా కన్నులకు కట్టినట్లు వర్ణించేరు.

రుక్మిణీదేవి మనస్సు అతలాకుతలమయి, తను పంపిన బ్రాహ్మణుడు ద్వారకకుపోయెనో? లేదో? ఇంక వచ్చునో? రాడో! భగవంతుడగు శంకరుడు నా కనుకూలము చేయునో? చేయడో? గౌరీదేవి నన్ను రక్షించునో? రక్షింపదో? తుదకు నా అదృష్టము గతి ఎట్లో కదా అని చింతించినప్పుడూ గౌరీదేవినే మ్రొక్కుకున్నది.

ఇంకా కొంత పురాతనకాలం అంటే రామాయణ కాలానికి పోతే అక్కడ సీతాదేవికూడా గౌరీపూజ చేసినట్లు ప్రమాణం ఉంది

తులసీరామాయణంలో కులాచార విధులు నిర్వర్తించిన తరువాత కులగురువులు సీతామాతచేత గౌరీపూజ, విఘ్నేశ్వరపూజ చేయించగా దేవతలు ప్రత్యక్షముగా వచ్చి, పూజలందుకొని, ఆశీర్వదించేరుట.

తులసీదాసకృత శ్రీరామచరిత మానసలో ఈ ఘట్టాన్ని ఎలాగ వర్ణించారో చూడండి.

చౌపాయి॥ మజ్జను కరిసరసఖిన్హ సమేతా।
గయీముదితమన్‌గౌరినికేతా॥
పూజాకీన్హి అధిక అనురాగా।
నిజ అనురూప సుభగ బిరూమాగా॥ (బాలకాండ - దోహ 227 (iii))

భావము : సరోవరములో సఖులతో స్నానముచేసి సీతాదేవి ప్రసన్న మనస్సుతో గిరిజాదేవి (పార్వతి) మందిరం చేరుకుంది. ఆమె అక్కడ చాల ప్రేమతో పూజ చేసి, తనకు యోగ్యమైన సుందరవరుని కోరుకొనెను.

శ్రీరాముడు తమ్ముడు లక్ష్మణునితో మిథిలానగర వనంలో సంచరిస్తూ సఖులతో గౌరీపూజకు ప్రయాణమవుతున్న సీతాదేవినిచూసి ధనుషయజ్ఞం ఈమెకోసమేనని సంకేతమిచ్చారు.

బాలకాండ దోహా 234, 235, 256లలో సీతాదేవి గౌరీదేవిని ప్రార్థించి, పూజించిన ఘట్టములు అతి మనోజ్ఞంగా వర్ణింపబడినవి.

ఉద్యానంలో సీతాదేవి తన నేత్రముల ద్వారా రాముని రూపమును తన హృదయములో బంధించుకొని, ఱెప్పలనేక వాటములను మూసి వేసెనట.

రాములవారిని సీతాదేవి హృదయములో చిత్రించుకొని, భవాని గుడికి వెళ్ళి, చేతులు జోడించి, దేవిని "ఓ లోకమాతా! జగజ్జననీ! నీకు మరల-మరల నమస్కారములు చేయుచున్నాను. నీవు అందరి హృదయములలో నివసించుచుందువు. నామనోభావము నీకు బాగుగా తెలియును. నేను చెప్పనక్ఖరలేదు."

ఆమె భక్తికి భవానీదేవి పరవశురాలైపోయెను. ధేవి కంఠమునుండి పుష్పమాల జారెను. దానిని సీతాదేవి ఆదరముతో చేతికి తీసికొని కనులకద్దుకొని శిరమున ధరించెను. దేవి ఈ విధముగా అన్నట్లు ఆమెకు అనిపించినదట. "సీతా! నామాట నిజము. నీ మనస్సులోని కోర్కె పూర్తియగును, భయపడకుము, నారదుని వాక్యములు తప్పవు, నీవు కోరిన వ్యక్తియే నీకు వరుడుగా లభించును. నీ హృదయము పవిత్రమైనదని నాకు తెలియును."

ఈ వాక్యములు విని, సీతాదేవి, ఆమె చెలికత్తెలు సంతసించి, ఉమాదేవికి మరల మరల నమస్కరించి యింటికి బయలుదేరి వెళ్ళిపోయిరి.

సీతాస్వయంవరం సమయంలోకూడా ఆమె మనస్సులో ధనుషుయొక్క బరువును తగ్గించమని, ప్రసన్నం కమ్మని గణేశుని, గౌరీదేవిని సీతాదేవి ప్రార్థించిందట. (బాలకాండ, దోహా 256 (iii, iv) ).

సీతారాముల వివాహానంతరం గురువు వశిష్ఠులవారి అనుజ్ఞపొంది, దశరథుడు ఈశ్వరుడు, పార్వతీదేవిని గణేశుని స్మరించి, ఆనందించి, సుముహూర్తాన అయోధ్యానగరం ప్రవేశించారు. (బాలకాండ - దోహా- 346 (iv) )

శివ-పార్వతుల వివాహసమయంలో కూడా మునుల అనుజ్ఞపొంది, ఈశ్వరుడు, పార్వతీదేవి గణేశుని పూజించేరుట, తులసీదాసు ఈ సందర్భంలో దేవతలు అనాదులని, శివపార్వతుల సంతానం గణేశుడుకదా మరి గణేశుని పూజ ఏమిటని మనస్సులో శంకించవద్దని సూచించారు. (బాలకాండ - దోహా - 100 (i) ).

ఇటువంటి పురాతన సంస్కృతి, సాంప్రదాయము మనకుండబట్టే మన వివాహ వ్యవస్థ ఈనాటికీ ఛిన్నాభిన్నం కాకుండా మిగిలి ఉంది.

సమాజం ఎంత మారినా, పరిస్థితులు ఎంత తారుమారైనా, మన వ్యవస్థ నాటికీ, నేటికీ చెక్కుచెదరకుండా ఉంది. అందుకే వివాహం" ఏడు జన్మలబంధం", "నూరేళ్ళపంట" అంటారు.

# విశ్వయోగివాక్కు - వేదవాక్కు

-- రత్న మోహిని

"మానవతా! మానవతా! అదియే విశ్వంజీమాట
సమైక్యతా! సమైక్యతా! అదియే విశ్వంజీ బాట
ఒకటేమాట! ఒకటేబాట
ఒకటేబాట! ఒకటేమాట"

అని ఎలుగెత్తి పలికిన మహాయోగి సాక్షాత్తు దత్తస్వరూపుడు శ్రీ విశ్వయోగి విశ్వంజీమహరాజ్ గుంటూరు కృష్ణనగర్‌లో శ్రీ ఆకుల కోటేశ్వరరావుగారు, శ్రీమతి ఈశ్వరిగారు నిర్మించుకున్న శ్రీనిలయాన్ని తమ భౌతికావాసంగా విశ్వమందిరంగా, శ్రీ విశ్వయోగి విశ్వంజీ ఎన్నుకున్నారు. తత్ఫలితంగా ఆ దంపతులకు, వారి సంతానానికి నిత్యం ఆ సద్గురువుకి శుశ్రూష చేసుకునే మహద్భాగ్యాన్ని కలుగజేశారు.

నేడు శ్రీ విశ్వయోగి విశ్వంజీ ప్రేమ, మహిమలు మానవతావాదము, విశ్వవ్యాప్తమగుట, దేశ, విదేశీయులందరు శ్రీ విశ్వంజీగారితో ఫోనులో సంభాషణలు సలుపుట సామాన్య విషయముకాదు. విశ్వశక్తినంతయు, తన స్వశక్తిగా చేసికొనిన మహితాత్ముడు శ్రీ విశ్వంజీ. వారి వాక్కు వేదవాక్కు. దానికి తిరుగులేదు. వారి సంకల్పము వజ్రసంకల్పము. వారి మానవతావాదము నిత్యనూతనము. వారి శక్తి అనంతము. వారి ప్రేమ అపారము, హద్దులులేనిది. వారి సేవ అమోఘము వారాచరించు నిత్యనైమిత్తిక కర్మలు సకలార్థ సాధకంబులు. ఇన్ని శక్తులుండి ఏమి ఎఱుగనట్లు మానవులమధ్య అతి సామాన్య మానవునివలె తిరుగుట గమనార్హము. సర్వమత సమ్మతమే సాయిమతమనునట్లు శ్రీ విశ్వంజీ మతముకూడ సర్వమతసమ్మతమే. దీనికి నిదర్శనము వారు గుంటూరు పట్టణమునకు పదహారు (16) కిలోమీటర్ల దూరములో నిర్మించిన "విశ్వనగర్"నందుగల సర్వమత స్థూపమే.

"కలడు చర్చిలోన! కలడు మసీదులో
కలడు గుడిని! చూడకన్నులున్న
కణకణమ్మునందు కలడురా పరమాత్మ
విశ్వయోగిమాట! వెలుగుబాట"

అని ఎలుగెత్తి నినదించుచు పలికిన పలుకులు, శ్రీ విశ్వంజీ సర్వమత సమాహార స్వరూపులను విషయము వెల్లడిచేయుచున్నది. "భగవంతుడు ఒక్కడే అతడు సర్వాంతర్యామి" అని చాటిన ఘనులలో గణనీయుడు శ్రీ విశ్వంజీ. అట్టి అవతారమూర్తి మాటలు వృధాకావు. వారు చెప్పినట్లు జరిగియేతీరును. జరుగునదే చెప్పును చెప్పునదే చేయును.

నేను మొదట శ్రీ విశ్వంజీగార్శిని 1995వ సంవత్సరము మేనెలలో దర్శించి

నమస్కరించినప్పుడు స్వామి "గుండె వాల్వులన్నీ సరిగ్గా ఉన్నాయా? పరీక్ష చేయించు" అని పలికిన పలుకులు విని సత్యసాయివలెనే వీరుకూడా సర్వజ్ఞులని గ్రహించితిని. నాగుండె కవాటము ఒకటి సరిగా పనిచేయుటలేదన్న సత్యమును ప్రధమ దర్శనములోనే విశ్వయోగి వెల్లడించినారు. తదుపరి వారు ఎప్పుడు హైదరాబాదువచ్చినను వారిని దర్శించుకొను భాగ్యము కలిగించుచున్నారు. మరల శ్రీ విశ్వంజీ గారిని గుంటూరు పట్టణములో 1996 జనవరి 26 తేదీని దర్శించినప్పుడు వారు మా కుటుంబ సభ్యులపై చూపిన కరుణకు అంతెక్కడ? అనిపించినది. తల్లి, తండ్రి, గురువు, సకలము తానై మమ్ము ఆదరించి పలుకరించి ఆనందింపజేసి ఆరోగ్యముకొరకు పాటించవలసిన నియమములన్ని చెప్పి వెంట, జంట, నేనున్నానని అభయమిచ్చి పంపించినారు.

మరొకమారు 1996 మార్చి 11వ తేదీ మా వారి పుట్టినరోజునాడు స్వామి ఆశీస్సులకొరకు గుంటూరు విశ్వమందిరమునకు వెళ్ళినప్పుడు వారు తమ దివ్యాశీస్సులను అందించినారు. హైదరాబాదు వచ్చినప్పుడు మా ఇంటికి రావలసినదని వారిని కోరగా వెంటనే వారమురోజులకే మార్చి 18వ తేదీనాడు మా గృహమునకేతెంచి పావనము చేయుటయేగాక సత్సంగము సలిపి మమ్మందరను ఆనందపరచి ఆశీర్వదించినారు. ఇట్టి సద్గురువు సాంగత్యములో మన జీవితములు కడపుట పూర్వజన్మ పుణ్యమనకతప్పదు. నేను సత్యసాయిని గూర్చి పుస్తకము వ్రాయవలెనని మొదలుపెట్టితిని కాని, పని జరుగుటలేదని వారికి విన్నవించినప్పుడు, వారు నాకిచ్చిన అమూల్యమగు సలహాలు, ఉత్సాహప్రోత్సాహములు మరువరానివి. వారి సంకల్పములేనిదే ఏమియు జరుగదు.

ఈ సందర్భములోనే పుస్తకము విషయములో నాకు కలిగిన ఒక సందేహము, మా అక్కగారిద్వారా స్వామికి విన్నవించవలసినదని గుంటూరు వర్తమానము పంపినప్పుడు స్వామి "అమ్మాయి ఏప్రిల్‌లో నా దగ్గరకు వస్తుంది అప్పుడు చెబుతానులే" అని పలికిరట. ఏప్రిల్ మాసములో గుంటూరు వెళ్ళవలెనన్న ఆలోచనయే అప్పట్లో మాకులేదు. కాని ఏప్రిల్ నెలలో విజయవాడమీదుగా మద్రాసు పోవలెనని హైదరాబాదునుండి విజయవాడకు బస్సులో బయలుదేరితిమి. బస్సులో నాకు కొంత అనారోగ్య పరిస్థితి కలిగినది. సకాలంలో ఆ బస్సు విజయవాడ చేరుకున్నట్లైతే మేము అనుకున్నట్లుగా పినాకినీ ఎక్స్‌ప్రెస్ పట్టుకుని మద్రాసు వెళ్ళగలిగియుండేవారము. కాని ఆ బస్సు విజయవాడ ఆలస్యముగా చేరినది. దానికితోడు నా ఆరోగ్య పరిస్థితి బాగుండనందువల్ల గుంటూరు వెళ్ళి స్వామి దర్శనము చేసికొని వారి సన్నిధిలో కొంత సమయము గడిపి ఊరట పొందవలెనన్న ఊహ కలిగినది. వెంటనే గుంటూరు బయలుదేరి వెళ్ళినాము.

గుంటూరు చేరగానే వార్తాపత్రిక చూడగా ఆరోజు మద్రాసు పోవు పినాకినీ ఎక్స్‌ప్రెస్

రద్దు అయినట్లు తెలిసినది. అది కేవలము విశ్వయోగి సంకల్పము. నెలరోజులముందే మా అక్కగారితో "అమ్మాయి ఏప్రిల్‌లో నాదగ్గరకొస్తుంది" అన్నమాటల అంతరార్థమిదియేకదాని గ్రహించితిమి. మనకంటే బాగా మనలనుగూర్చి మన భవిష్యత్తుగూర్చి వారికే తెలుసునని, విశ్వంజీ సర్వజ్ఞులని మరొక్కమారు దృఢముచేసికుంటిని.

మేము అమెరికా వెళ్ళి, కొంతకాలము గడిపి, ఇంక కొద్దిరోజులకు ఇండియా తిరిగివత్తుమనగా నాకు అనారోగ్యము కలిగి ఆందోళన చెందితిని. అనుకున్నదానికంటె ముందుగానే ఇండియాకు తిరిగి రావలసివచ్చునేమో, ఇండియాకు బయలుదేరులోపల పిట్స్‌బర్గ్‌లో నున్న వేంకటేశ్వర దేవాలయము చూడవలెననుకుని పిట్స్‌బర్గ్ బయలుదేరుముందు స్వామికి ఫోనుచేయగా, వారుకొన్ని ఆహార నియమములు చెప్పి "పిట్స్‌బర్గ్ వెళ్ళిరా! వచ్చిన తరువాత నాకు ఫోనుచేయి" అని చెప్పిరి. అందుచేత అనారోగ్య పరిస్థితి కొంతమరచి పిట్స్‌బర్గ్‌కి ధైర్యముగా ప్రయాణము చేయగల్గితిని. ఇంకొక విశేషము. పిట్స్‌బర్గ్‌లో శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించిన పిమ్మట స్వామి సంకల్పముతో అచటకు దగ్గరలోనున్న షిర్డి సాయిబాబా మందిరమునకు వెళ్ళితిమి. దానిలో, పూజా మందిరము, ఒకవైపు షిర్డిసాయిబాబా ఫోటో, మరియొకవైపు సత్యసాయిబాబా ఫోటో అమర్చబడియున్నవి. ఆ దినము షిర్డిసాయిబాబా వారి పుట్టినదినము (సెప్టెంబరు 28) కారణముగా అఖండనామ సంకీర్తన జరుపుచుండగా మేము లోనికి ప్రవేశించితిమి. షిర్డిబాబాతో బాటు పుట్టపర్తి బాబానుకూడ అచట దర్శించగలిగితిమి. సత్యసాయిబాబావారి నిలువెత్తు పటము చూడగానే నాకు ఒడలు పులకరించి నా ఒంట్లో ఉన్న రోగములన్ని ఆ క్షణమే మటుమాయమై పోయాయన్నంత ధైర్యము, ఆనందము కలిగినవి. అది గొప్ప దివ్యానుభూతి. స్వామి "పిట్స్‌బర్గ్ వెళ్ళిరా" అని చెప్పుటలోని అంతరార్థమిదియే కదా అని అనుకొంటిని. స్వామి చెప్పిన ప్రకారము పిట్స్‌బర్గ్‌నుంచి తిరిగి వచ్చిన మరునటిరోజు గుంటూరు ఫోనుచేసి మాట్లాడి విశేషములన్ని స్వామికి విన్నవించుకుంటిని. వారి ఆశీస్సులతో, అమెరికా దేశములో అనుకున్న ప్రకారము ఇంకా మూడు వారములు గడిపిన తరువాతనే ఇండియాకు బయలుదేరవచ్చును అని దృఢనిశ్చయమునకు రాగలిగితిని.

అక్టోబరు 23వ తేదీ అమెరికానుండి ఇండియాకు మా తిరుగుప్రయాణము. లండన్ నుంచి మద్రాసు వచ్చు విమానములో నాకు వాంతులు మొదలయినవి. మందులు దగ్గరలేవు. మా చేతిసంచులు బరువుగా ఉన్నకారణముతో విమానపు సిబ్బందివారు వాటిని ఆఖరు నిమిషములో, విమానములోనికి ప్రవేశించిన తరువాత లగేజివేయు కేబిన్‌లో వేసినారు. మందులు బయటకు తీసికొను అవకాశము చిక్కలేదు. వాంతులు మొదలయిన తరువాత మందులగురించి ఆలోచన కలిగినది. ఏమి చేయలేని పరిస్థితి ఏర్పడినప్పుడు శ్రీ

సత్యసాయిబాబావారిని, శ్రీ విశ్వయోగి విశ్వంజీగారిని తలచుకొంటూ "ఓం శ్రీ సాయిరాంగురుదేవదత్త" మంత్రమునే జపిస్తూ కూర్చున్నాను ఆ మంత్రమే నాకు దివ్యౌషధమైనది. వాంతులు కట్టి నాకు కొంతసేపటికి కొంత ఉపశమనము కలిగినది.

ఇండియాకు తిరిగివచ్చిన తరువాత స్వామికి గుంటూరు ఫోనుచేసి విమానములో నాకు కలిగిన అనారోగ్య పరిస్థితిని గూర్చి వివరించినప్పుడు, మధ్యలోనే స్వామి సమాధానంగా "అంతా నాకు తెలుసు" అన్నారు. "మంత్రశక్తి మనిషినే దైవంగా మార్చగలదు" అను భావము "శాంతి ప్రేమదాయి శ్రీ సత్యసాయి" శతకంలో స్వామి వివరించారు. అట్టి మహత్తర శక్తి గల మంత్రమే "ఓం శ్రీ సాయిరాంగురుదేవదత్త" భగవంతుడు భావప్రియుడు. బాహ్యప్రియుడుకాడు అని చెప్పుచూ శ్రీ విశ్వయోగి విశ్వంజీ తమ "శాంతి ప్రేమదాయి"లో ఈ విధంగా వివరించారు.

"పూలగుత్తులెన్ని పూజలో నుంచినా
పులకరించబోడు పుచ్చుకోడు
హృదయకమలమొసగ సదయుడై గ్రహియించు
శాంతిప్రేమదాయి సత్యసాయి"

ఇచట శరణాగతి బావముతో భగవంతుని పిలువవలెనని శ్రీ విశ్వంజీ భావము.

శ్రీ సత్యసాయికి, సమకాలీనమగు అవతారమూర్తిగా శ్రీ విశ్వయోగి విశ్వంజీ వెలుగొందుట భారతావని పుణ్యభాగ్యమేకాక యావత్ ప్రపంచ ప్రజలందరి పుణ్యభాగ్యముకూడా. మనసు, మాట, క్రియ ఏకమై కలియొక్క దారుణ చర్యలన్నీ అరికట్టు నిమిత్తము శ్రీ షిర్డిసాయి, శ్రీ సత్యసాయి, శ్రీ విశ్వంజీ ఇన్ని అవతారములు కూడా భారతదేశమునందే సంభవించుట మన మహద్భాగ్యమే! ఇంతకంటె వేరొండు పుణ్యముండునా!

విశ్వయోగిని చూడ విశ్వమే తరలివచ్చు
విశ్వనగరమంత విశ్వనిలయమగును
విశ్వశాంతికి విశ్వయోగి నిర్మించిన
విశ్వనగరు వైభవమ్ము వీనుల విందుగాదే!



మరోసారి

# సాయికథలు

- అక్కిరాజు రమాపతిరావు

## శ్రేయః ప్రాప్తం, సుఖానిచ

భక్తుడికి సాయిపట్ల సంపూర్ణమైన, హృదయపూర్వకమైన భక్తి కలిగితే దుఃఖంనుంచీ అపాయాలనుంచీ బాబా ఆ శరణాగతుణ్ణి కాపాడి రక్షించేవాడు. ఆ భక్తుడి యోగక్షేమాలు తానే కనిపెట్టి చూస్తూ ఉండేవాడు. ఇందుకు ఉదాహరణం దామోదర్ సావల్‌రామ్‌రాసనేకాసార్ కథ. ఇతణ్ణి దాము అన్నా అని పిలిచేవారందరూ.

ఈయన అహమద్‌నగర్‌లో కాపరం చేసేవారు. ఒక భార్యకు పిల్లలు కలగలేదని రెండోపెళ్ళి చేసుకున్నా ఆమెకు కూడా చాలాకాలం వరకు సంతానం కలగలేదు. ఇంతలో దాము అణ్ణాకు కోపర్‌గాంలో సర్కిల్ ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తున్న గోపాలరావు గుండుతో పరిచయం కలిగింది. గోపాలరావుకు శ్రీ సాయినాథుడి అనుగ్రహంవల్ల సంతానం కలిగింది. దాము అణ్ణా కూడా సాయినాథుణ్ణి ఆశ్రయించాడు. ఆయన కోరికకూడా నెరవేరి ఆయన పుత్రవంతుడైనాడు.

గోపాలరావుగుండు షిరిడీలో శ్రీరామనవమి ఉత్సవం కనులపండువగా జరుపటానికి పూనుకొని దాము అణ్ణానుకూడా అందులో పాలుపంచుకోవల్సిందిగా అర్థించాడు. ద్వారకామాయి అలంకరణ నిమిత్తం ఒక చక్కని జండాను ప్రతియేటా సమర్పించవలసిందిగా దాము అణ్ణాను గోపాలరావు ప్రోత్సహించాడు. అందుకు పరమానందంతో అంగీకరించాడు దాము అణ్ణా. ఆయన అహమద్‌నగర్ విడిచిపెట్టి పూనాలో కాపురం పెట్టినా శ్రీరామనవమి ఉత్సవంపట్ల భక్తి ప్రవృత్తులు చూపుతూనే వచ్చాడు. కాలులో ముల్లు విరిగినా సాయినాథుణ్ణి శరణువేడుతూనే ఉన్నాడు. సర్వాత్మనా శ్రీసాయినాథుణ్ణే తన శ్రేయః సంధాతగా నమ్ముకుంటూనే ఉన్నాడు. షిరిడీలో శ్రీరామనవమినాడు జరిగే ఉత్సవానికి బీదలకు అన్నదానం కూడా నిర్వహిస్తూవచ్చాడు దాము అణ్ణా. అంతా సాయిదయ అనే దృఢమైన చిత్తవృత్తిని పరిపోషించుకుంటూ దాము అణ్ణా ముందుకు సాగాడు జీవితంలో.

ఇంతలో ఆయనకు ఒక ప్రలోభం కలిగింది. స్వతహాగా అతడు అందుకు లోబడేవాడుకాడు. కాని బొంబాయిలో ఉంటున్న అతడి స్నేహితుడొకడు దాము అణ్ణాకు బాగా పురి ఎక్కించాడు. పత్తి వ్యాపారం ఇప్పుడు ఎంతో ప్రోత్సాహకంగా వుంది. కొంచెం జాగ్రత్తగా నిర్వహించుకుంటే లాభం లక్షలలో మాటే. తనతో భాగస్వామిగా జట్టీ వ్యాపారంలో దిగితే అలవోకగా రెండు లక్షలరూపాయలు దామూ భాగానికి లాభం చూపుతాను అని ఆ జులాయి స్నేహితుడు ఊదరగొట్టాడు.

దాము అణ్ణాకు ఈ పరిస్థితి చాలా ఉద్విగ్నంగా తయారైంది. ఈ అవకాశం అందిపుచ్చుకోవటమా జారవిడుచుకోవటమా అని గొప్ప ఆందోళనకు ఆయనలోనైనాడు ఈ

గుత్త వ్యాపారంపై ఆసక్తి అనే పాశం అతణ్ణి చుట్టుకొని యీడ్వటం ప్రారంభమైంది. స్వయంగా సాయిబాబాను దర్శించి యీ లౌకిక విషయం ఆయనకు విన్నవించి సలహా తీసుకోవటానికి మొహమాటపడ్డాడాయన. అందువల్ల శ్రీ సాయినాథుడికి ఎంతో అంతరంగికుడైన శ్యామాను ప్రార్థిస్తూ బాబాను ఈ విషయమైన సలహా అడిగి వెంటనే తనకు తెలుపవలసిందిగా కోరాడు దాము అణ్ణా. అహమద్‌నగర్ నుంచి ఇవాళ రాయగానే మర్రోజే శ్యామాకు ఆ ఉత్తరం షిరిడీలో చేరింది. ఆ ఉత్తరం పట్టుకుని శ్యామా ద్వారాకామాయి మెట్లెక్కి బాబా పాదాలముందు ఆ ఉత్తరం ఉంచాడు. ఏమిటా కాగితం అని అడిగారు బాబా. మీ సలహా ఏమిటో తెలుసుకోవాలని దాము అణ్ణా రాసిన ఉత్తరం ఇది అని చెప్పాడు శ్యామా.

'ఓహో! దాము అణ్ణా ఏమంటున్నాడు. ఏదో తవ్వితలకెత్తుకుందామని యోచిస్తున్నాడే! భగవంతుడిచ్చిన దానితో తృప్తిపడక ఆకాశానికి ఎగిరిపోదామని చూస్తున్నాడే!' ఏదీ ఆ ఉత్తరం చదువు అని బాబా అడిగాడు. ఆశ్చర్యమేముంది'. బాబా చెప్పిందే ఆ ఉత్తరంలో ఉంది. బాబా ఆ ఉత్తరాన్ని . ఎంతో ఆసక్తిగా విన్నారు. కొడుకుదగ్గరనుంచి వచ్చిన ఉత్తరాన్ని తండ్రి ఎంత జాగ్రత్తగా సావధానంగా వింటాడో అంత కనికరంతో ప్రేమతో దయతో ఆ ఉత్తరాన్ని బాబా విన్నారు.

'సేటుకు పిచ్చి ఎత్తిందా ఏం? అతడి ఇంట్లో ఏ లోటూ ఉండదని వ్రాయి. తనకు భగవంతుడు ప్రాప్తింపజేసిన సగం రొట్టెతోనే తృప్తి పొందమని చెప్పు. లక్షలు కూడబెట్టాలనే అత్యాశ తగదని రాయి' అని బోధించారు బాబా. ఉత్తరం తపాలపెట్టెలో వేసినప్పటినుంచీ ఎంతో ఆత్రంగా ఎదురుచూశాడు దాము అణ్ణా. శ్యామా ఉత్తరం చేరగానే చెట్టుకొమ్మమీదినుంచి జారిపడ్డట్లు ఆశాభంగంచెందాడు. తన ఆశ అంతా అడియాశ అయిపోయిందే అని బాధపడ్డాడు. అయితే మిణుకు మిణుకుమనే ఆశా జ్యోతి ఒకటి శ్యామా రాసిన ఉత్తరంలో కన్పించింది అణ్ణాకు. అదేమంటే ఉత్తరం ద్వారా అడగటానికి స్వయంగా సన్నిధికి వచ్చి ఆశ్రయించటానికీ ఎంతో భేదం ఉంటుందికదా! నీవు వచ్చి బాబా మ్రోల మొరపెట్టుకుంటే ఏమైనా ప్రయోజనం ఉండవచ్చునని రాశాడు శ్యామా. అందుకని హుటాహుటి షిరిడీ చేరాడు దాము అణ్ణా. ఎంతో ఆత్రంగా బాబాకు నమస్కరించాడు. అయితే నలుగురిముందూ బాహాటంగా తన వ్యాపార ప్రయోజనాలనుగూర్చి బాబాను ప్రశ్నించడానికి దాము అణ్ణా సంకోచించాడు. అయితే ఒక ఎత్తు వేశాడు మనసులో. తనకు వ్యాపారంలో లాభంవస్తే బాబాకు అందులో వాటా ఇవ్వడమనే ఆలోచనే ఆ ఎత్తు. అతడాతలపోతలలో ఉండగానే సర్వజ్ఞుడైన బాబా 'లౌకిక విషయాలలోకి నన్నెందుకు లాగుతావు! ప్రపంచవిషయాలలో దిగటం నాకు ఇష్టంలేదు' అని స్పష్టంగా చెప్పివేశాడు.

భూత భవిష్యద్వర్తమానాలన్నీ బాబాకు తెలియకపోతేకదా! తన బిడ్డలకు హితమేమిటో తల్లికి తెలియకుండా ఉంటుందా! బిడ్డ ఆరోగ్యంకోసం చేదుమందు ఇవ్వటానికి కూడా తల్లి వెనుకాడదు. ఇక లాభంలేదని దాము అణ్ణా తన మిత్రుడి ప్రోత్సాహకర వ్యాపారంపై ఆశ వదులుకున్నాడు. ఏ ప్రయత్నం చేయలేదు. అయితే ఆశ పూర్తిగా చావక ధాన్యం వ్యాపారం చేయటానికైనా బాబా అంగీకరించి ఆశీర్వదిస్తే బాగుండును అనుకున్నాడు

మనసులో. ఈ ఆలోచన బాబా వెంటనే గ్రహించారు. లాభంలేదు. నీవు ఏడుసేర్ల చొప్పున పోగుచేసి ఏడు సేర్ల చొప్పున అమ్మాల్సి వుంటుంది. కాబట్టి ఆ ఆలోచనే రానీయవద్దు అని హెచ్చరికగా పలికారు.

బాబా చెప్పింది అక్షరాలా నిజమైంది. కొన్నాళ్ళు ధాన్య వ్యాపారం ఎంతో ఆకర్షకంగా వుంది విపణివీధిలో. ఇంతలో రెండునెలలు ఎడతెగకుండా వర్షాలు కురిసాయి. ధాన్యం ధరలన్నీ హఠాత్తుగా పడిపోయాయి. వ్యాపారంలో దడాదడి ధోరణి రోజురోజుకూ పెరిగిపోయింది. ఆశతో హెచ్చుధాన్యం నిలవ చేసిన వాళ్ళందరికీ భారీ నష్టాలు భరించాల్సిన దుస్థితి కలిగింది. దాము అణ్ణా ధాన్యం వ్యాపారమే చేసి ఉంటే అతడికి పుట్టగతులుండేవికావు. బాబా అనుగ్రహమే అతణ్ణి రక్షించింది. పత్తి వ్యాపారంచేసినవాళ్ళు అధః పాతాళానికి కుంగిపోయినారు. దళారులు బాగా చితికిపోయినారు. దీనితో దాము అణ్ణాకు బాబా అనుగ్రహంపట్ల మరింత గురి, చెప్పలేని విశ్వాసం కలిగాయి. తనకడమ జీవితమంతా బాబా కరుణకే మొదుకట్టుకున్నాడతడు.

ఒకసారి బొంబాయినుంచి బాబాకు మూడువందల మామిడిపండ్ల బుట్ట బహుమానంగా పంపారెవరో భక్తుడు. గోవానుంచి శ్యామాకు అది బట్వాడా అయింది. రాలే అనే భక్తుడు ఆ పార్సెలు పంపించాడు. ఆయన మామాలత్‌దారు. ఆ పార్సెలు విప్పిచూడగా పండ్లన్నీ ఎంతో చక్కగా ఉన్నాయి. ఒక్కటికూడా చెడిపోలేదు. దాన్ని శ్యామా అజమాయిషీకి అప్పగించాడు బాబా. అయితే అందులోనుంచి నాలుగు పండ్లుమాత్రం తీసుకుని బాబా తన కొలంబలో భద్ర పరచారు 'ఈ నాలుగు దాము అణ్ణాకోసం దాచాను. వీటినెవరూ ముట్టుకోకూడదు' అన్నారు బాబా.

బాబా లీలలు ఎవరు అర్థం చేసుకోగలరు! ఆయన కరుణ ఉంటే తప్ప. మామిడిపండ్ల పెద్దబుట్ట షిరిడీకి చేరిన రెండుగంటలకల్లా దాము అణ్ణా అక్కడకు చేరడం వింతైన సంగతి. నేరుగా అతడు బాబా పాదసన్నిధికి పోయి ఆయనకు నమస్కరించాడు. అప్పుడు బాబా చమత్కారంగా 'అందరిదృష్టీ మామిడిపండ్లపైనే పడ్డది. ముఖ్యంగా నేను దాచిన ఆ మామిడిపండ్లవైపే అందరూ చూస్తున్నారు. అవి దామూ తినిచావాలి - అంటే ఎవరూ వినరేం! కాబట్టి దామూ మాత్రమే వాటిని తినిచావాల్సిందే"

దాము అణ్ణా ఈ మాటలు విని తత్తరబిత్తరైనాడు. ఎంతో భయపడ్డాడు. కాని అక్కడే ఉన్న మహల్సాపతి, బాబాగారి ప్రేమపాత్రుడు, మిక్కిలి ఆంతరంగ భక్తుడు బాబా మాటల అంతరార్థాన్ని ఇట్లా వివరించాడు. చావటమంటే అహంకారం నిర్మూలంకావటమే. ఎవరికైనా అహంకారం నిర్మూలమైతే అంతకన్నా కావల్సిందేముంది! బాబా పాద సన్నిధిలో నిలిచి అర్హుడైన వాడికి అహంకారం చస్తుంది. అది బాబా ఆశీర్వాదమే. ఈ విషయాన్ని ఇట్లా గ్రహించాలి.

అప్పుడు బాబా దయతో 'ఈ పండ్లు నీవు తినేవు సుమా! తినవద్దు. నీ చిన్నభార్యకివ్వు. ఈ ఆమ్రలీల ఆమెకు నలుగురు కొడుకులను, నలుగురు కూతుళ్ళను అనుగ్రహిస్తుంది.

దాము అణ్ణా బాబా మాటలు పాటించాడు. 'నీకు సంతానయోగం లేదు' అనే

జ్యోతిష్కుడి మాటలు దాము విషయంలో కల్లలైనాయి.

బాబా మాటలు అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ రిత్తకావు. ఆయనపిలిస్తే పలికే దైవం. ఆయన సాకారంగా లీలలు చూపేరోజుల్లో ఒకసారి ఇట్లా అన్నారు 'నేను సమాధిచెందినప్పటికీ ఆ సమాధిలో నుంచే నా ఎముకలు మాట్లాడుతాయి. అవి మీకు ఆశను, నమ్మకాన్నీ కలగజేస్తాయి. మనస్ఫూర్తిగా శరణంటే నేను మీతోనే ఉంటాను. మీరెంత మాత్రం ఆందోళన చెందవద్దు. మీ క్షేమాన్ని నేను ఎల్లప్పుడూ కనిపెడుతూనే ఉంటాను.'

విష్ణు సహస్రనామ పారాయణ ఫలితం వ్యాసభగవానుడిట్లా శెలవిచ్చారు

శ్రేయఃప్రాప్తం సుఖానిచ - అంటూ శ్రీ సాయి భగవానుడు ఈ అభయ ప్రదానానికి పరమాహ్లాదకరమైన ఉదాహరణం.

# కాళిదాస సందేశము

(గతసంచిక తరువాయి) *కీ॥ శే॥ శ్రీ అక్కిరాజు నిత్యానందశాస్త్రి*

శ్లో॥ కామేక పత్నీవ్రత దుఃఖశీలాం
లోలం మనశ్చారుతయా ప్రవిష్టాం
నితమ్బినీ మిచ్ఛసి ముక్తలజ్జాం
కణ్ఠే స్వయంగ్రాహనిషక్త బాహుమ్ 3-7

(వ॥ సౌందర్య కారణమున లోలమగు నీ మనస్సునం బ్రవేశించిన యేనితం బినిని పాతివ్రత్యదుఃఖశీలను లజ్జను త్యజించిన స్వయం గ్రహణముతో కంఠమందు నిషక్తబాహువు కలదానినిగా నీవు కోరుచున్నావు.)

శ్లో॥ అసమ్మతః కస్తవ ముక్తిమార్గం
పునర్భవక్లేశ భయాత్ ప్రపన్నః
బన్ధశ్చిరం తిష్ఠతు సున్దరీణాం
ఆరేచితభ్రూ చతురైః కటాక్షైః 3-5

(వ॥ నీ కిష్టుడుగాని యెవడు, సంస్కృతి భయమువలన, ముక్తిమార్గమును పొందెనో తెలుపుము. ఆరేచిత భ్రూచరములగు సుందరీకటాక్షములతో నతడు చిరకాలము బద్ధుడై పడియుండునుగాక.

శ్లో॥ అధ్యాపి తస్యోశన సాఽపి నీతిం
ప్రయుక్తరాగ ప్రణిధిర్ద్విషస్తే
కస్యార్థధర్మౌ నద పీడయామి
సిన్ధో స్తటావోఘ ఇవప్రవృద్ధః 3-6

(వ॥ శుక్రునియెద్ద నీతి శాస్త్రము నభ్యసించిన వాడైనను, ప్రయుక్తరాగ ప్రణిధియగు నేనీశత్రువుయొక్క యర్థకామములను, విస్తరిల్లిన ప్రవాహము, నదీతీరములను పీడించినట్లు, పీడింపవలెనో తెలుపుము.)

నేను, "అర్థ ధర్మములను గూల్చి వేయుదును" అను కాముని మాటలయందీ కామతత్వము గర్భితమై యున్నది. అర్థ ధర్మములు నశించిన వెనుక పశుక్రియా పరాయణమగు, నాసుర ప్రకృతి ప్రధానమగును. లోక ప్రతిష్ఠకే హాని యాపతితమగును. మఱియు, దాంపత్యము, మనోహరమగు, రూపమును త్యజించును. ధర్మమూలమై యుత్తమప్రయోజన సాధనమగు, దాంపత్య పరమార్థము, సమగ్రత్వముతో నశించును. విశుద్ధ దాంపత్యమందీకామమునకు బ్రత్యర్థిత్వము గలదని కవి దీని తత్వమును దెలిపెడిని. ఇట్టి కామముతో నిర్ణీతమగు ప్రేమమునకుత్తమత్వములేదని కాళిదాసు లోకమును బ్రబోధించును. ఇంద్రియ ప్రేరణలో, ప్రేమను నిర్ణయించుట యత్యంత మనర్థహేతువని, మదనునకు సజీవ దహనము సంప్రాప్తించిన కారణము నాకాశవాణి రతికి దెలిపిన సందర్భమున కవి ప్రకటించెడిని. ఇయ్యది యాకాశవాణీ ప్రవచనము.

శ్లో॥ అభిలాష ముదీరి తేన్ద్రియః
స్వసుతాయా మకరోత్ ప్రజాపతిః

ఆధతేన నిగృహ్యా విక్రియా
మభిశప్తః ఫలమేత దన్వభూత్. 4-41

(వా॥ ప్రేరేపింపబడిన యింద్రియము గలవాడై ప్రజాపతియాత్మజ నభిలషించెను. అనంతర మింద్రియ వికారమును నిరోధించి యతడు శపింపగా కాముడీ ఫలము ననుభవించెను.)

కాముడు అనగా నింద్రియలోలత్వము ప్రజాపతిచేత నాత్మజను మోహింపజేసి శాపోపహతుడయ్యెనని కవి తెలియజేయును. ఇంద్రియప్రేరణకు లోబడినచో యుక్తాయుక్త వివేకము నశించుననియు, బుద్ధి సంస్తంభించిపోవుననియు, కవి తెలియజేసెడిని. ధర్మమున కధీనమై వర్తించుటయందే కామము ఉత్తమత్వమును బ్రాప్తించి శ్రేయస్కరమగునని కాళిదాస ప్రవచనము. ధర్మ పరిరక్షణముకొఱకు దాంపత్య విశుద్ధికొఱకు నౌచిత్య పరిపాలనార్థ మీస్వేచ్ఛావ్యవహారికామమును, వరనేత్రాగ్ని కర్పించి 'తృటిలో' భస్మావశేషము నొనర్చెడిని.

"ధర్మప్రాదుర్భావము"

శ్లో॥ అనేన ధర్మ స్సవిశేష మద్యమే
త్రివర్గ సారః ప్రతిభాతి భామిని
త్వయా మనో నిర్విషయార్థకామయా
యదేక ఏవ ప్రతిగృహ్య సేవ్యతే

(వా॥ భామినీ! అర్థకామములను తలపెట్టని, నీచే ధర్మమొక్కటియే స్వీకృతమై, సేవింపబడుచున్నందువలన, నాకిప్పుడు ధర్మము సాతిశయముగ త్రివర్గ సారమై తోచుచున్నది.

ఇంద్రియ లోలత్వము, స్వేచ్ఛావర్తనమును పొందుటవలన దాంపత్య మధోగతి పాలగునని కవి తెలిపియున్నవాడు. ఇక దాంపత్యమున కెట్టు లుత్తమత్వము, సిద్ధించునను నంశమును కవి విశదీకరించెడిని. ప్రేమను, వ్యావహారిక కామము నిర్ణయింపని సందర్భముననే దాంపత్యమునకు శ్రేష్ఠ్యము సమకూరుననెడి, యభిప్రాయమును కవి ప్రకటించి యుండుట విదితము. రూపవిత్తాదుల నాశ్రయించి యుండెడి వ్యావహారిక కామముతో నింద్రియ ప్రేరణము ప్రేమను నిర్ణయించుట యనిష్టఫలకారణమని, కవి ప్రకటనము. వ్యావహారిక కామస్పర్శదోషములేని ప్రేమ నిర్ణయముననే స్వీయాభిమానము దత్తమైయున్నదని, కవి సూచించెడిని. కవి సర్గమున గామము, ధర్మశబలితమై పావనత్వములో వెలసెడిని. నిర్మలమగు నంతఃకరణ ప్రవృత్తికి భంగము వాటిల్లజేయు, రూపవిత్తములను, భోగభాగ్యములను కవి సర్గమున గామము త్యజించెడిని. స్వత్వమును ధర్మమందు విలీనము గావించెడిని. ధర్మస్వరూపమును దాల్చి రూపొందెడిని. ఇట్లే విషయములను కవి గౌరీప్రేమ తత్త్వ ప్రదర్శనమున తెలియజేయుచున్నవాడు. ఇంక పార్వతీ ప్రేమతత్త్వము విచారణాంశము. ఆ యంశమును వివరింతును.

వ్యాససర్గమున ప్రేమను నిర్ణయించిన కామమును గాళిదాసు స్వీకరించి ధర్మవిశిష్టమగు రూపభేదముతో స్వీయసర్గమున వెలయించి వాల్మీకి ప్రేమభావనమందు తనకుగల యభినివేశమును బ్రకటించును. వాల్మీకి సీత ప్రదర్శించిన మనోహర ధర్మశబలిత ప్రేమతత్త్వమును సాధనాంతరముతో గాళిదాసు పార్వతి ప్రదర్శించెడిని. వర నిర్ణయమున గవి నాయికీయాత్మ నిర్దేశమూలమగు స్వీయ వ్యాపారమును గోచరింపజేయును. పార్వతి పితృసాన్నిధ్యమందుండగా, నీశ్వరున కామె యర్ధాంగి కాగలదని నారదుడాదేశించును. ఉన్నత స్థానము నాక్రమింపవలెననెడి యాశయు, సంతోషమును, పార్వతీ మానసమునం

ప్రభవించినవి భర్తృసంబంధమగు సంకల్పముత్పన్నమైనది. భర్తృనిర్ణయము కేవల పిత్రాయత్తముకాదు. ఈ యంశమును కవి యీ శ్లోకమున బ్రస్ఫుటముగ బ్రకటించెడిని.

శ్లో॥ కదాచి నాసన్న సఖీముఖేన సా
మనోరథజ్ఞం పితరం మనస్వినీ
అయాచ తారణ్య నివాస, మాత్మనః
ఫలోదయాన్తాయ తపస్సమాధయే 5-6

(వ॥ నిశ్చలచిత్తయగు నామె యొకప్పు డభిలాషాభిజ్ఞుడగు తండ్రిని, ఫలోత్పత్తి యవధిగాగల తపోనియమముల కొఱకు, స్వీయారణ్య నివాసమును యాచించెను.)

పార్వతీ మనోరథమును తండ్రి యెఱుంగునని యామె సంకల్పమునకే కవి ప్రాధాన్యము నొసంగును. మఱియు తపఃఫలోదయమగు వఱకును. అనగా నపేక్షిత భర్తృలాభమొదవు వఱకును కాంతారవాసమును గాంక్షించెనని, వరసంఘటనమునామె కృత్యమునకే కవి సమర్పింప దలచెడిని. అంతయకాక ·

శ్లో॥ అథాను రూపాభినివేశతోషిణా
కృతాభ్యనుజ్ఞా గురుణా గరయసా
ప్రజాసు పశ్చాత్ ప్రథితం తదాఖ్యయా
జగామ గౌరీ శిఖరం శిఖణ్డిమత్ 5-7

(వ॥ అనంతరము యుక్తమగు నభినివేశమునకు సంతోషమునొందిన పూజ్యతముడగు జనకునివలన ననుజ్ఞను పొంది తపస్సిద్ధ్యనంతరము బ్రజాళిచే గౌరీశిఖరమనబరగు ప్రసిద్ధమగు నెమళ్ళుగల శిఖరమును గూర్చి వెళ్ళెను)

అనెడి శ్లోకమందనురూపమగు గౌర్యాసక్తికి, తండ్రి సంతోషించి, యనుజ్ఞా దానమొసంగెనని తెలుపుచు వరవిషయికమగు భావాభినివేశమును గవి యపర్ణయందే యారోపించెడిని. ఇట్లు కవి యొకతీరున వర నిర్ణయమున గౌరీకామప్రవృత్తిని గనబరచును. ఇంతవరకిది, వ్యాసుని శకుంతల, దమయంతి, సావిత్రి, దేవయాని ప్రేమ సమర్పణ నిర్ణయమం దవలంబించిన స్వయంనిర్ణయ విధానములతో బాహ్యరూపమున బోలియున్నది అట్లయ్యు ప్రేమ తత్త్వములయం దభిన్నములు.

ఇట్టిది కామముతో బ్రేమను నిర్ణయింపవలసిన సందర్భమై యున్నను, వరనిర్ణయ వ్యాపారమును గన్యకే వదలవలసిన విషయమైనను, వాల్మీకి సర్గమందలి పితృకృత వరనిర్ణయ విధానమందు తనకుగల యభిమానముతో గవి దీనిని సంపూర్ణముగ నాచ్ఛాదించి, వాల్మీకి సరణినే ప్రకటించెడిని. ఆదికవి యాశయమునే యావిర్భవింపజేసెడిని. ప్రాచేతసుని పథముననే వర్తించెడిని. పత్యభిలాషను నాయికయందుత్పన్నము గావించిన నారదాదేశ సందర్భమున, తదాదేశమును హిమ వత్సమ్మతముగ నొనర్చి జనకాభీప్సితమగు సంకల్పమే, తనయచే స్వీకృతమయ్యెనని చాటగలెడిని. పితృనిర్ణయమే, నాయికాభీష్టమని విశదీకరించెడిని.

శ్లో॥ శైలాత్మ జాపి పితురుచ్చిరసోఽభిలాషం
వ్యర్థం సమీక్ష్య లలితం వపురాత్మనశ్చ

(వ॥ శైలాత్మజయు, నుదాత్తుడగు జనకుని యభిలాషను స్వశరీర సౌందర్యమును నిష్ఫలమైన వానినిగా దలంచి)

అను శ్లోకమున కన్యావాంఛకును జనకుని యభిలాషకును సమాన ప్రతిపత్తిని కవి గనబఱచును. అభేదరూపమును బడసియున్న కన్యేచ్ఛయు, జనకాభిలాషయుగలసి వరలాభాభినివేశమునకు గారణములయ్యెనని కవి తెలిపెడిని. ఇట్లు వరనిర్ణయము పితృకృతమని కవి ప్రబోధము మఱియు, వివాహము సిద్ధించినప్పుడు

శ్లో॥ అథ విశ్వాత్మనే గౌరీ
సందిదేశ మిథః సఖీం
దాతా మే భూ భృతాం నా థః
ప్రమాణీ క్రియతామితి 6-1

(వ॥ అనంతరము "పర్వతనాధుడు, మద్దాన విషయమున నిర్ణయ హేతువుగ చేయబడునుగాక" అని రహస్యముగ విశ్వాత్మునకు బ్రియవయస్యతో గౌరి సందేశమంపెను)

పితృదత్తమగు పరిగ్రహము, నా కత్యంతము ప్రియమైనదని పార్వతి భాషించెను. ఆ మహానుగ్రహము ను తనకు బ్రసాదింపుమని వేడును. ఇట్లు కన్యయొక్క కోరికతో ప్రేమను నిర్ణయింపవలసిన సందర్భమందుగూడ వరనిర్ణాయకత్వమును పిత్రాయత్త మొనర్చి కవి కౌశలముతో వాల్మీకినే యనుసరించెడిని. పార్వతీ వరాభిలాష పితృపుత్రికలయందేక కాలమున నుదయించెననియు పార్వతీ వరలాభవాంఛకు పర్వతనాధుని యభిలాష కారణమయ్యెననియు గవి ప్రవచించును.

ఈ తీరున గవి గిరికన్యయొక్క కోరికతో ప్రేమను నిర్ణయింపవలసిన సందర్భమునను వాల్మీకి మార్గమున వర్తించుట గోచరించెడిని. మఱియు పార్వతీప్రేమ నిర్ణయమున కవి కనబఱచిన కామము, వ్యాససర్గమున గోచరించెడి కామమున కామూలాగ్రముగ భిన్నము. ఇది ధర్మరూపముగల యొక విశుద్ధగుణము. మహోన్నతమగు నిచ్ఛావిశేషము. ఉన్నత స్థానము నాక్రమింపవలెననెడి యుత్తమాభినివేశము. పూజ్యతను గడింపవలెననెడి పూనిక. మహత్వారాధన మందుగల మమత్వము. అత్యుదాత్తమగు నపేక్ష అకలంకమగు ననురక్తి, మహత్వమొక ధర్మము. తద్ధర్మారాధనమందే, పార్వతీచిత్తము లగ్నమైపోయినది. ఈ ధర్మాభిమానమే తన్వంగి హృదయు నావేశించినది. ఈ ధర్మస్వరూపునకే తరుణి ప్రేమను సమర్పించినది. ఆ లోకోత్తరుని పూజయందే యభిలాషను నిలుపగలిగెను. ధర్మ విశిష్టమగు నీకామము, అనగా, ధర్మాయత్తమగు నీకాంక్ష ధర్మమేయని కవి తెలిపెడిని. ఈశ్వరుడు ధర్మదీక్షితుడు. ధర్మారాధననే పార్వతికోరును. మిగిలిన విచారణ పార్వతి కావశ్యకముగాదు. నవమోహనాకారములను; మహైశ్వర్యములను, దివ్యోపభోగములను, ధీరస్వాంత తృణీకరించును.

శ్లో॥ ఇయం మహేన్ద్ర ప్రభృతీ నధిశ్రియ
శ్చతుర్దిగీశా నవమత్యమానినీ,
అరూపహార్యం మదనస్య నిగ్రహాత్
పినాకపాణిం పతిమాప్తు మిచ్ఛతి 5-53

(వ॥ అభిమానవతియగు నీమె, యధికైశ్వర్యముగల మహేంద్రాది చతుర్ది గీశ్వరులను బరిగణింపక మదనుని నిగ్రహించి రూపమున వశుడుగాని దేవదేవు బతిగా పొందగోరుచున్నది)

*(సశేషం)*

# శ్రీ విశ్వయోగి విశ్వంజీ జన్మదిన వేడుకలు

- వి. రత్నమోహిని

పుణ్యదినం, పవిత్రదినం
విశ్వయోగి పుట్టినదినం
విశ్వమానవ సమైక్యతకు నాందిపలికిన దినం
విశ్వయోగి ప్రణాళికలన్ని విశ్వరూపం దాల్చుటకు శుభోదయం

అవధూత చింతన శ్రీ గురుదేవదత్త సాయిదత్త విశ్వదత్తయైన విశ్వంభరుని జన్మదిన వేడుకలు తిలకించే భాగ్యం మాకు విశ్వయోగి కలిగించారు. ఇది "విశ్వమానవ సమైక్యతాదినం"గా స్వామి ప్రకటించారు. ఐకమత్యం కరువైపోయిన నేటి విశ్వంలో ఐక్యత సాధించాలనుకోవడం సముచితం. సమంజసం. వ్యక్తి సంస్కరణ దగ్గర మొదలై ఈ సమైక్యత విశ్వమంతా వ్యాపించాలంటే దానికి ఎంతకృషి అవసరమో ఊహించగలము. ప్రపంచంలో యావత్ మానవాళిని కుల, మత తత్త్వాలకతీతంగా తీర్చిదిద్ది ఐక్యత సాధించాలన్నదే విశ్వయోగి ఆశయము, ఆకాంక్ష, లక్ష్యము. ఇట్టి ఆశయం నెరవేర్చడానికి కంకణం కట్టుకుని విశ్వయోగి కార్యాచరణకు ముందుకు దూకుచున్న శుభసమయం ఈ దినం.

సాక్షాత్తూ దత్తమూర్తి, దివ్యపురుషుడు ఇటువంటి మహత్తర కార్యానికి పూనుకొనుట విశేషము. యావత్ మానవాళి గర్వించదగ్గ విషయము. అదృష్టముకూడ. దీనికి అందర్నీ సహకరించవలసిందిగా విశ్వయోగి కోరడం జరిగింది. ఎవరిని ఎప్పుడు ఏవిధంగా రప్పించాలో, ఏ పనులు ఎవరిచేత చేయించాలో, ఏ విధంగా చేస్తే వారిలో మంచి పరివర్తన (మార్పు) కలుగుతుందో అన్నీ ఆ దత్తమూర్తికే ఎఱుక. మత కలహాలకు, మారణహోమాలకు స్వస్తిచెప్పి ఐక్యతయే ధ్యేయంగా పెట్టుకున్ననాడు విశ్వకళ్యాణం జరిగే తీరుతుంది. దీనికోసమే శ్రీ విశ్వయోగి విశ్వంజీ నిర్విరామ కృషి సల్పుచున్నారు.

విశ్వయోగి జన్మదిన వేడుకలు మార్చి ఒకటవ తేదీ మొదలుకొని ఐదవ తేదీవరకు జరుపబడినవి. ఈ "విశ్వమానవ సమైక్యతాదినం" పేరిట అనేక కార్యక్రమములు నిర్వహింపబడినవి. గుంటూరుకి పదహారు కిలోమీటర్ల దూరంలో నిర్మింపబడిన 'విశ్వనగర్' ఆవరణలో మార్చి ఒకటవతేదీ శ్రీ విశ్వయోగి దివ్యాశీస్సులతో ప్రప్రథమంగా ఉచిత వైద్యశిబిరము నిర్వహింపబడినది. పలురంగములలో నిష్ణాతులైన వైద్యులందరు వచ్చి చుట్టుప్రక్కల గ్రామములనుంచి వచ్చిన రోగులకు ఉచితవైద్యసేవలందించి మందులు పంపిణీ చేసిరి. ఇది అత్యద్భుతముగా విజయవంతముగా కొనసాగినదని ప్రతినెల ఒక ఆదివారము ఈ వైద్య శిబిరము జరుగనున్నదని శ్రీ విశ్వయోగి నిర్ణయించినారు.

మార్చి రెండవ తేదీ కృష్ణనగర్‌లోని "శ్రీ విశ్వమందిరము"లో శ్రీ విశ్వయోగి దివ్యాశీస్సులతో శ్రీ లలిత సహస్రనామ పారాయణ, మూడవతేదీ శ్రీ విష్ణు సహస్రనామపారాయణ ప్రసాద వినియోగము జరిగినవి. మార్చి నాల్గవతేదీ ఉదయము భజన అనంతరము శ్రీ మాధవపెద్ది రాధాకృష్ణమూర్తి పుణ్యదంపతులచే పాదుకలకు పూజ, "శ్రీ విశ్వదత్తవ్రతము" జరుపబడినవి. అనంతరము ఆ దినము అవిష్కరింపబడు పలు

గ్రంథములను గురించి ఆయా రచయితలందరు క్లుప్తముగా ఉపన్యసించిరి. తదుపరి, అచట చేరిన వారందరకు "మధూకర్" (భోజనము) ఏర్పాటు చేయబడినది. భక్తులందరూ ప్రసాదము స్వీకరించుచుండగా శ్రీ విశ్వయోగి స్వయముగా ప్రతి ఒక్కరి దగ్గరకు వచ్చి తమ స్వహస్తములతో కలిపిన అన్నము అందరకు ఒక్కొక్క ముద్ద చేతులలో వేసినారు.

ఇంకను నాల్గవతేదీ సాయంకాలము పలువురు ప్రముఖులు, మేధావులు వ్రాసిన గ్రంథములు రచించినవారు, ఆవిష్కరించుటకు ఆహ్వానింపబడినవారుకూడ ఉపన్యసించిరి. ప్రతిగ్రంథముకూడ విశ్వయోగితత్త్వమును, చక్కగా వివరించుచున్నది. ఒకరు మహిమలు వ్రాస్తే మరొకరు స్వానుభవములు, ఇంకొకరు విశ్వయోగి సందేశములలోని విశేషములు, వేరొకరు విశ్వసమైక్యతను గూర్చి ఇంకను ఆధ్యాత్మికతకును, విజ్ఞాన శాస్త్రమునకు గల సంబంధమును రకరకములగు అంశములను కూర్చి గ్రంథస్థము చేసినారు. ఇవేకాక, కొందరు సద్గురుమూర్తుల చరిత్రలు, భగవద్గీత వంటి కృతులు స్వామి అనుగ్రహముతో విడుదలయినవి.

తెలుగు, సంస్కృత భాషలలో నిష్ణాతులైన పలువురు పండితుల, విదూషీమణులతో కూడిన సాహిత్యరూపకము "శ్రీ విశ్వదత్తవిజయము" శ్రీ ప్రసాదరాయకులపతి గారి సారధ్యముతో రూపొందింపబడినది. విశ్వయోగి కార్యక్రమమంతయు శ్రద్ధగా తిలకించుట విశేషము. సంగీత సాహిత్యములందు విశ్వయోగికి గల అభిరుచికూడనిట్టిదే. రాత్రి పన్నెండు (12) గంటల సమయంలో శ్రీ విశ్వంజీ కేక్ కోయుటకు ముందు ఈ విధంగా అన్నారు "కేక్ కొయ్యడం అంటే అందరిలో దాగియున్న దుర్గుణాలు, అసూయ, క్రోధం, ద్వేషం మొదలైన వాటన్నిటిని కోసిపారవేసి మ్రింగేయడమేనని దీని అర్థాన్ని వివరించారు. తమతోపాటు వేదికపై మరికొందరు చేతులుపట్టుకొని ఈ కేక్‌ని కోసినారు. తమ స్వహస్తములతో కోసిన కేక్‌ను స్వయముగా ప్రసాదమును అందరకు పంచినారు. ఇది వారి ఓరిమికి నిదర్శనము. భగవంతుని ప్రతి చర్యకు అర్థముంటుంది. వారు ఏది చేసినా లోకకళ్యాణార్థం తప్ప వారికొరకు వారేమి చేయరు. చేయవలసిన అవసరం లేదు.

మార్చి ఐదవతేదీ (5) ఉదయం నగర సంకీర్తన వేద పఠనము జరిగినది. తదుపరి భజన, సంగీతకార్యక్రమములు జరుగుచుండగా శ్రీ విశ్వయోగి ప్రతిఒక్క భక్తునకు ~ందనమస్కారమిచ్చి వారి దివ్యాశీస్సులనందజేయుట అపూర్వ విషయము. వారు ముందుగనే ఈ కార్యక్రమము చేయుటకు సంకల్పించి జన్మదిన వేడుకలు, ఇతర కార్యక్రమములు నాలుగు దినములు జరుపవలెనని భక్తులందరిని స్వయముగా ఆశీర్వదించవలెనని నిర్ణయించినారు. వారికిగల ప్రేమకు, దయకు ఇవి తార్కాణములు. ఈ సంఘటన భవిష్యత్తులో మధుర స్మృతిగా మనందరము తలంచుకొను తరుణము ఆసన్నమగుచున్నది. వారి కార్యక్రమములన్ని విశ్వవ్యాప్తమగు సమయముకూడ సమీపించుచున్నది. శ్రీ సత్యసాయిబాబావారు పదునెనిమిదిమంది బాలబాలికలతో ప్రారంభముచేసిన భజనమండలి ఈనాడు విశ్వవ్యాప్తమయినట్లే నేడు విశ్వయోగి ప్రారంభము చేసిన చేయబోవుచున్న కార్యక్రమములన్నీ విశ్వవ్యాప్తి చెందుననుటలో ఆశ్చర్యములేదు.

జన్మదినము సందర్భముగా జరుపబడిన హోమములో మంత్రోచ్చరణతో శ్రీ విశ్వయోగి తమ దివ్యహస్తములతో హవిస్సులు అగ్నికి ఆహుతి చేసినారు. ఉదకమును తమ

స్వహస్తములతో అందరు హాజరైనవారిపైన జల్లి వైదికాశీస్సులిచ్చుట విశేషము. తదుపరి "అవధూతస్నానము" పేరిట మంత్రోచ్చారణ చేయుచు విశ్వయోగి స్నానమాచరించిరి. భక్తులందరు వారిపైన ఉదకము చెంబులతో పోసిరి. ఈ ప్రక్రియలన్నియు లోకకళ్యాణముకొరకు, విశ్వశాంతికి విశ్వయోగి ఆచరించిన కార్యములేనని భావింపనగును.

ఇంక ఐదవతేదీ సాయంకాలము బాలబాలికలచే సాంస్కృతిక కార్యక్రమములు ప్రదర్శింపబడినతరువాత పలువురు ప్రముఖులందరు తమతమ ఉపన్యాసములు చెప్పిరి. అనంతరము శ్రీ విశ్వయోగి మార్చి ఒకటవతేదీ 'విశ్వనగర్'లో నిర్వహింపబడిన ఉచితవైద్య శిబిరములో పాలుపంచుకొన్న వైద్యులందరిని సత్కరించి వారికి తమ ఉత్సాహ ప్రోత్సాహములనందించిరి. కొందరు ప్రముఖ ప్రభుత్వాధికారులనుకూడ శ్రీ విశ్వయోగి సత్కరించిరి. వారివారి రంగములలో భారత ప్రభుత్వము వారికి గౌరవ పురస్కారములందించినందులకు విశ్వయోగి వారిని సత్కరించి వారికి మరింత ప్రోత్సాహమునందించిరి. ఇస్లాం మతస్థులు, క్రైస్తవ మత ప్రవక్తలుకూడ ఈ సభలో ప్రసంగించుట విశేషము. విశ్వయోగి సర్వమత సమాహార స్వరూపులనుటకిది యొక నిదర్శనము. కుల మతాలకతీతమైన తత్త్వమే విశ్వయోగి తత్త్వము.

ఇంతమంది నిష్ణాతులైన పెద్దలందరు విశ్వయోగిని గురించి ఒక్కొక్కరు ఒక్కొక్కరకంగా అభివర్ణించిన ఆ శుభవేళలో అచటి వాతావరణమంతయు దివ్యత్త్వముతో నిండిపోయినది. గుంటూరు జిల్లా ఇటువంటి సద్గురువు కృపాకటాక్షములకు నోచుకున్నది. గుంటూరు జిల్లా కలెక్టరుగారు ప్రకృతి వైపరీత్యం సంభవించబోతున్న సమయంలో విశ్వంజీ అభయమిచ్చి కాపాడిన విధానమునంతా వివరించారు. పంచభూతాలు షిర్డిసాయిబాబా స్వాధీనంలో ఉండేవని గ్రంథములలో చదివియున్నాము. నేడు అటువంటి సన్నివేశములు స్వయంగా తిలకిస్తున్నాము.

తదనంతరం శ్రీ విశ్వయోగి క్లుప్తంగా తమ జన్మదిన సందేశమునమగ్రహించిరి. వారు "తాము ప్రసంగాలు చేయడంకంటే కార్యాచరణయే ముఖ్యమంటూ వక్కాణించి ఎక్కువ సమయం తాము ఉపన్యాసమునకు కేటాయించుటలేదని ప్రప్రథమంగా తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఈ కార్యాచరణకు ఎంతోమంది యువతీయువకులనందరినీ విశ్వశాంతి సేవాసంస్థ సభ్యులనుజేసి వారిచేత ఎన్నో పనులు చేయించదలిచినట్లు శ్రీ విశ్వయోగి సెలవిచ్చారు. కోట్లకొలది శక్తి తమయందు నిక్షిప్తమైయున్నదని అది ఎవరికి కావలసినట్లు వారు వాడుకొనవచ్చునని, ఆరోగ్యంలేనివారికి ఆరోగ్యం ప్రసాదిస్తానని స్వామి వాగ్దానంచేశారు. వారి జీవితకాలంలో ఈ జన్మదినం ఒక మలుపు అని వారు సూచన ప్రాయంగా చెప్పారు. సమాజంలో చెడును జయించాలని మంచిని ప్రవేశపెట్టాలని ప్రేమను పెంచుకుని పంచాలని విశ్వయోగి సెలవిచ్చారు. అందరిని సంస్కరించి కులమత భేధాలు లేకుండా తమవైపు ఆకర్షించుకుంటారు విశ్వయోగి. ఈనాడు అస్తవ్యస్తమైన స్థితిని ఎదుర్కోవడానికి, మానవుడు శక్తివంతం కావాలని అరిషడ్వర్గాలకు లొంగక, అన్నిటిని అధిగమించి జ్ఞానాన్ని పెంచుకోవాలని దానికి పట్టుదల (Will power) అవసరమని స్వామి వివరించారు. "ప్రతివారు తమతమ కర్తవ్యాన్ని నిర్వహించాలి" (Work is worship; Duty

is God) అని చెబుతూ అచటనున్న ప్రభుత్వాధికారులందరికీ ఆశీస్సులందజేశారు అచట జేరినవారందరిని ఉద్దేశించి స్వామి "విశ్వమందిరం ప్రాంగణంలో నున్నవారంతా తమకు సమానమేనని ఎట్టి తారతమ్యములు లేవని చెప్పిరి. "విశ్వనగర్" గురించి చెబుతూ స్వామి తమ ప్రణాళిక ప్రకారం కార్యక్రమాలు కొనసాగించడమే తమ లక్ష్యం, ధ్యేయం, అదేతమ ప్రాణం, ఆలోచన అని ఆవేశపూరితంగా పలికారు. "విశ్వమానవసమైక్యతా కార్యక్రమాలు, ఆ భావాలు మీ హృదయంలో సుస్థిరం చేయాలి" అని శెలవిచ్చారు. మొదట గృహాలు ప్రశాంతి నిలయాలుగా మారాలని ఉద్ఘాటించారు. భక్తుల ప్రేమ, అభిమానం, భక్తి ప్రవృత్తులకు విశ్వయోగి కృతజ్ఞతలు తెలియజేశారు

విశ్వమానవ సేవాసంస్థ కంకితమై, ఈ జన్మదిన వేడుకల నిర్వహణ కార్యక్రమములలో నిమగ్నమైయున్న ఒకానొక భక్తుని సన్నిహిత బంధువు హాస్పిటల్‌లో ఆపరేషను జరుగు సమయములో క్లిష్ట పరిస్థితి యందున్నప్పుడు విశ్వయోగి అచటికేగి ఆమెను రక్షించి కాపాడి వచ్చినట్లు స్వయముగా తమ ఉపన్యాసములో సెలవిచ్చిరి. ఇది వారి "సర్వాంతర్యామిత్వము"నకు నిదర్శనము. ఇంకను అనేకమంది భక్తులు ఈ జన్మదిన వేడుకల సందర్భముగా ఇష్టాగోష్ఠులు జరుపు సందర్భములో ఇటువంటి అనేక సంఘటనలు వివరించిరి

ఇంకను విశ్వయోగి తమ ఉపన్యాసములో పలువురు మేధావులు, వేలకొలది సంఖ్యలో ప్రజలు 'విశ్వనగర్' వచ్చే సంవత్సరము జన్మదిన వేడుకలకు రాగలరని సెలవిచ్చినారు వారిది వజ్రసంకల్పము వారిది వేదవాక్కు కాబట్టి ఆ విధముగా జరిగియేతీరును. ఆత్మవిశ్వాసము, సత్‌సంకల్పములతో మొదలుపెట్టు కార్యక్రమములన్నీ దిగ్విజయమౌతాయన్నదే విశ్వంజీబోధ.

శ్రీ విశ్వయోగి తలపెట్టిన విశ్వమానవ సమైక్యతా కార్యక్రమములన్ని "ఇంతింతై వటుడింతై" అనురీతిలో తప్పక కొనసాగగలవు.

# స్వర్ణోత్సవం

- వనం సావిత్రీనాథ్

స్వర్ణోత్సవ స్వతంత్ర భారతదేశం
ఏమిటి స్వజనుల కిచ్చే సందేశం
అర్ధశతాబ్దపు మన ప్రజాస్వామ్య
పరదాలవెనుక దాగున్న అనుభవాలు ఎన్నెన్నో
బొక్కసాన్ని బొక్కి బొక్కి దక్కినది చేతపట్టి
బొక్కలు మాత్రమే మిగిలిన ప్రజాస్వామ్యాన్ని
అర్ధరాత్రి గాలితప్ప మరేమీ కదలని వీధుల్లో
ఆంగ్లేయుల నుండి అందుకున్నాం
సమరయోధుల రక్తమాంసాలతో నేసిన
త్రివర్ణపతాకం ఎర్రకోటపై అంబరాన్ని చుంబించింది
చరిత్ర భారాన్ని మోస్తున్న భేతాళుని శవంలా
భారత రాజ్యాంగం చుట్టూ అల్లుకున్నాయి ఎన్ని కలలు
గతించిన కాలంవెంట గడచీగడవని బతుకు భారం
ఆశగా ఎదురుచూసి అంతే నిరాసక్తంగా నిట్టూర్పు విడుస్తున్నది
ప్రజాసేవనే బురఖా చాటున కులం, మతం, ధనం
ప్రతి ఎన్నికలలలో మార్చే చదరంగపు పావులు
పేదవాని ఒకే సాధనం ఓటు కల్లబొల్లి కబుర్లతో హైజాకవుతున్నది
కాగితాలపై చేసే గారడి పేదవాని ఆకలిని, చీకటిని తొలిగించడంలేదు
పాతిక సం॥రాల ఐ.ఎ.యస్., ఐ.పి.యస్. సర్టిఫికేట్లు
ఐదు సం॥రాల అధికారానికి ఆడియో, వీడియో క్యాసెట్ల
ఇంజనీరు, డాక్టరు సర్టిఫికెట్లు
అగ్రదేశాల అభివృద్ధికి జారుడుమెట్లు
విద్యాలయాలు, వైద్యాలయాలు ధనార్జనా కేంద్రాలు
సామాన్యుని బతుకుకు నరక ద్వారాలు
న్యాయదేవత అనుంగు నల్లకోటు

నల్లబజారులో వేలం పాటయ్యింది
స్కీములతో - స్కాములతో మన కరెన్సీ స్విస్ బేంక్‌లో చేరుతూంది
సంస్కృతీ సాంప్రదాయాలు పరాయి దేశాలనుండి దిగుమతి అవుతున్నాయి
మానవత్వం ఇంకా ఎంత మిగిలింది అన్న ప్రశ్నకు సమాధానం
చెడును వెన్న ముద్దలా మింగి పాపాలను జీవనదుల్లో కడగడమే
వారు కడిగిన రుధిర ధారల ఉదకమే ఫిల్టరయి వచ్చే సామాన్యుని తాగునీరు
మతోన్మాదంతో దూసుకొచ్చిన కత్తులు - రాజకీయ ఎత్తుల
విత్తులే సామాన్యుని తిండి గింజలు
అయోధ్యలో కూలిన బాబ్రీ మసీదు క్రింద
రాముడున్నాడా? అని వెతుక్కోవాలి
మసీదు కూల్చిన మట్టిక్రింద రహీం ఉన్నాడేమో వెతుక్కోవాలి
రామ్-రహీం ఏక్‌హై - హమ్ సబ్ భాయి భాయి అన్న
నినాదం జాతిపితతోనే కనుమరుగయ్యింది
అవినీతి భారీ పరిశ్రమకు తట్టుకోలేక
ప్రజాస్వామ్య కుటీర పరిశ్రమ కుంటుతూంది
నిండు నూరేళ్ళు బతకాలన్న సామాన్యుని వాంఛ
మృత్యు రూపంలోని స్వార్థం, సగటు మానవుణ్ణి వేధిస్తున్నది
ప్రకృతినే ధిక్కరిస్తున్న మానవ విధ్వంసకాండను
ఎంతకూ తీరని స్వార్థ రాజకీయ దాహంను
సామాన్యుడు నిలదియ్యనంతకాలం
నాలుగు గోడలమధ్య తింటూ కంటూ జీవించే
మానవమృగం కాగలడు
గాలివాటం ప్రజాస్వామ్యంలో పుల్లిస్తరాకు కాగలడు
ప్రజాస్వామ్యరక్షణ తోడేళ్ళ చేతుల్లో ఉన్నంతకాలం
రోజుకో గొర్రె బలిపశువు కాగలదు
గొర్రెలే ఎదురుతిరిగి తోడేలుని తరిమితరిమి కొట్టాలి
స్వేచ్ఛా స్వాతంత్రాలను నిలబెట్టాలి
అదే ఈ దేశ సందేశం - అదే మనందరికీ ఆదేశం - ఉపదేశం

# సంక్షిప్త రామాయణమ్

*రచన, కూర్పు : రుద్రావఝుల రామకృష్ణారావు*

ప్రస్తుతకాలమాన పరిస్థితుల్లో రామాయణ, భారత, భాగవత గ్రంథాలు చదవడానికి సమయం ఎవరికీ చిక్కడంలేదు. చిన్నప్పుడు విద్య, వయస్సులో ఉద్యోగం, వార్ధక్యంలో కుటుంబాల విచ్ఛిన్నం వల్లో, ఆరోగ్యం సరిలేకో లేక కుటుంబ బాధ్యతలు తీరక మనుమల-మనుమరాళ్ళ వివాహాల సమస్యో ఏదేనా కావచ్చును.

ఈ కలికాలంలో కేవలం "శ్రీరామ" అని ఒక్కమారు పలికినా, రామనామం జపించినా, లిఖించినా అనంతపుణ్యమంటారు మన పెద్దలు

అందుకే రామాయణం సంక్షిప్తంగా వ్రాయబడిన శ్లోకాలు, పద్యాలు ఒకచోట చేర్చి మాలగా అందిస్తున్నాను. అందుకోండి.

శ్లో॥ అదౌరామతపోవనాదిగమనం హత్వామృగం కాంచనం
వైదేహీ హరణంజటాయు మరణం సుగ్రీవ సంభాషణమ్।
వాలీ నిగ్రహణం సముద్రతరణం లంకాపురీ దాహనం,
పశ్చాద్రావణ కుంభకర్ణ హననం, త్వేతద్ధి రామాయణమ్॥

శ్రీమదాంధ్ర భాగవతము (పోతన) షష్ఠస్కంధము "శ్రీమన్నారాయణ కవచము" నందు ఒక పవిత్రమైన సీసపద్యం నిత్యపారాయణకు ప్రార్థనగా ఉపకరిస్తుంది. సంక్షిప్తంగా ఉన్నా, "మరచెంబులో మహాసముద్రం" (గాగర్‌మేసాగర్) అన్నట్లు ఉంటుంది చూడండి.

సీ॥ తాటక మర్దించి తపసిజన్నముగాచి హరివిల్లు విఱిచి ధైర్యమునమెఱసి
ప్రబలులైనట్టి విరాధక బంధోగ్రఖరదూషణాది రాక్షసులదునిమి
వానర విభునేలి వాలిగూలగనేసి జలరాశి గర్వంబు జక్కజేసి
సేతువు బంధించి చేరి రావణ కుంభకర్ణాది వీరులగడమిద్రుంచి

తే॥ యల విభీషణు లంకకు నధిపుజేసి
భూమిసుత గూడి సాకేతపురమునందు
రాజ్యసుఖములు గైకొన్న రామవిభుడు
వరుస నన్మబ్రోచుచుండు బ్రవాసగతుల (వావిళ్ళ Page 460 (306))

మనం చిన్నప్పుడు కంఠస్థం చేసిన రామతారక శతకములోని పద్యం ఎంత మనోజ్ఞంగా ఉందో చూడండి.

సీ॥ భానువంశమునందు ప్రభుడవై జన్మించి
యఖిల విద్యలనెల్ల నభ్యసించి
తాటక మర్దించి తపసియాగముగాచి
శిలను శాపము మాన్పిస్త్రీనిజేసి
శివుని చాపముద్రుంచి, సీతను బెండ్లాడి
పరశురాముని నాత్మభంగపఱచి,
తండ్రివాక్యము కొఱకు తమ్మునితోగూడ
వైదేహితోడను వనముకేగి

ఖరదూషణాదుల ఖండించి రాక్షస
మారీచమృగమును మడియజేసి
లంకకురాజైన రావణాసురుడొచ్చి
సతిగొనిపోవంగ సంభ్రముడిగి
సుగ్రీవుగనుగొని సుముఖివైయప్పుడు
వాలిని వధియించి, వరుసతోడ
రాజ్యమాతనికిచ్చి, రాజుని చేపట్టి
కిష్కింధయేలించి, కీర్తివడసి

తే|| వాయుసుతుచేత జానకీవార్తదెలిసి
తరలిసేతువు బంధించి, త్వరగదాటి
రావణానుజాశభయంబు రయము నొసగి
ఘోరరణమందు రావణుగూలనేసి
యతని తమ్ముని రాజుగా నమరజేసి
సతిని చేకొని సురలెల్ల సన్నుతింప
రాజ్యమేలియయోధ్యకు రాజవైన
రామతారక దశరథరాజతనయ|| (25)

పద్యకావ్యము మొల్లరామాయణము, సుందరకాండము 64, 65వ పద్యములలో కవయిత్రి మొల్ల ఎంత సుందరంగా రామాయణాన్ని సంక్షిప్తం చేశారో చూడండి.

సీ|| కూకటి ముడికినై కురులుగూడనినాడె
బెదరక తాటకబీచ మణచె
గాథేయుడొనరించు క్రతువును రక్షింప
బెక్కండ్రు దైత్యుల నుక్కణంచె
నవనిపై విలసిల్లు నఖిల రాజన్యులు
వ్రేలజూపగలేని విల్లు విఱిచె
ఘోరాటవులలోన గ్రుమ్మరునప్పుడు
ఖరదూషణాది రాక్షసులజంపె

తే|| బాదరజమునునొక ఱాయిబడతిజేసె
లీల మాయామృగంబును గూలనేసె
రాజమాత్రుండెమేదినీ రక్షకుండు
రామభూపాలుడాది నారాయణుండు (64)

తే|| అట్టిరామునకీయది యనగనెంత
లంకయననెంత దనుజుల పొంకమెంత
నీవనగనెంత నీవావుచేవయెంత
చెప్పనేటికీ నీవెచూచెదవుగాక (65)

శ్లో|| యావత్ స్థాస్యంతి గిరియస్సరితాశ్చమహితలే।
తావద్రామాయణ కథాలోకేషు ప్రచరిష్యతి||

అన్నమయ్య సంకీర్తనాత్మకమైన రామకథా సన్నివేశాలు ఒకే కీర్తనలో ఎంతమనోజ్ఞంగా చిత్రించారో తిలకించండి.

బౌళిరామక్రియరాగం

పల్లవి॥ ఇతడే పరబ్రహ్మమిదియె రామకథ
శతకోటి విస్తరము సర్వపుణ్యఫలము

చరణం 1 ధరలోరాముడు పుట్టెధరణిజ బెండ్లాడె
అరణ్యవాసులకెల్ల నభయమిచ్చె
సొరిది ముక్కుజెవులు చుప్పనాతినిగోసె
ఖరదూషణులను ఖండించివేసె ॥ఇతడే॥

చరణం 2 కినిసి వాలిజంపి కిష్కింధ సుగ్రీవుకిచ్చె
వనధి బంధించి దాటి వానరులతో
కనలి రావణ కుంభకర్ణాదులను జంపి
వనిత జేకొని మళ్ళివచ్చెనయోధ్యకును ॥ఇతడే॥

చరణం 3 సౌమిత్రియు భరతుడు శత్రుఘ్నుడు గొలువగ
భూమియేలె కుశలవపుత్రులు గాంచె
శ్రీమంతుడై నిలిచె శ్రీ వేంకటాద్రిమీద
కామించి విభీషణులంకకు బట్టముగట్టె ॥ఇతడే॥

(అన్నమాచార్యుల సంకీర్తనలు - TTD Series No 129, Page 7)

అధ్యాత్మ రామాయణము సంక్షిప్త రామాయణమే. బాలకాండ ప్రధమసర్గలో ఈశ్వరుడు పార్వతీదేవికి చెప్పిన కథాపరిచయం ఎలాగ ఉందో చూడండి.

శ్లో॥ విశ్వామిత్ర సహాయత్వం మఖసంరక్షణం తతః।
అహల్యా శాపశమనం చాపభంగో మహేశితుః॥
మత్పాణిగ్రహణం పశ్చాద్భార్గవస్య మదక్షయః।
అయోధ్యానగరేవాసోమయం ద్వాదశ వార్షికః॥
దండకారణ్యగమనం విరాధవధ ఏవచ।
మాయా మారీచ మరణం మాయాసీతాహృతిస్తథా॥
జటాయుషోమోక్షలాభః కబంధస్యతథైవచ।
శబర్యాః పూజనం పశ్చాత్సుగ్రీవేణసమాగమః॥
వాలినశ్చవధః పశ్చాత్సీతాన్వేషణమేవచ।
సేతుబంధశ్చ జలధౌలంకాయాశ్చ నిరోధనమ్॥
రావణస్య వధోయుద్ధే సపుత్రస్య దురాత్మనః।
విభీషణే రాజ్యదానం పుష్పకేణమయంసహ॥
అయోధ్యాగమనం పశ్చాద్రాజ్యే రామాభిషేచనమ్।
ఏవమాదీని కర్మాణి మయైనా చరితాన్యపి॥
ఆరోపయన్తి రామేస్మిన్నిర్వికారేఖిలాత్మని। (గీతాప్రెస్ - గోరఖపూర్ (36-42))

సంక్షిప్తంగా కథను రాముడు విశ్వామిత్రునికి సహాయంగా వెళ్ళినది మొదలుకొని రాజ్యాభిషేకం వరకూ ఏడు శ్లోకాలలో కుదించబడింది. *(సశేషం)*

SARVEJANAH SUKHINO BHAVANTHU

సర్వేజనాః సుఖినో భవంతు

मोक्ष

काम

धर्म

సర్వార్థ సంక్షేమ సమితి

SARVAARTHA SANKSHEMA SAMITHI

**BOOK POST** **Printed Matter**

To

Smt. & Sri........................................

48. SRI.DR.B.RAMA RAJU
1-8-117/2,
Chikkadpalli,
HYDERABAD - 500 020.

*If undelivered please return to*

**SARVAARTHA SANKSHEMA SAMITHI**

*3-6-393, Plaza Apartments, Street No. 5*

*Himayatnagar, Hyderabad - 500 029*